# అభిప్రాయవేదిక

" మీయొక్క శ్రీవాణి నిజముగా శ్రీవాణి లాగానే వుంది. "

– యమ్. యస్. శర్మ
జిల్లా రిజిస్ట్రార్, నెల్లూరు

" శ్రీవాణి వచ్చిన రోజునే ఆద్యంతము ఆనాడే చదవడం నాకు పరిపాటి. ఆచార్య జి. వి సుబ్రహ్మణ్యం గారి 'సాంస్కృతిక విప్లవం రావాలి' అన్న వ్యాసం చదివి నప్పుడు నేను పొందిన ఆనందమునకు అంతులేదు. 'బహుమతులు, విభూతి బాబాగారు ఎందుకు ఇస్తారు ?' అన్న వ్యాసం సత్యాన్వేషణ తత్పరులకు ఎంతగానో ఉపకరించగలదు. ఇటువంటి అమూల్యమైన రచనలను అందిస్తున్నందుకు అభినందించుచున్నాను. "

– అద్దేపల్లి లక్ష్మణస్వామి, మచిలీపట్నం

" ఆదర్శనీయమైన శ్రీవాణి జన్మదిన సంచిక చాలా బాగున్నది. అన్ని తరహాల పాఠకులను ఆకట్టుకొనే రీతిలో ఉన్నది. తెలుగు భూమిలో పాఠకుల పాలిట ఓ వెలుగు కిరణం మీ పత్రిక అని చెప్పడం అతిశయోక్తి ఎంతమాత్రం కాదు. "

– యు. పాండురంగారావు
చిమోకోరి, భూటాన్

" శ్రీవాణిలో ఎన్నో విజ్ఞానదాయకమైన శీర్షికలు పెట్టి క్రొంగ్రొత్త విషయాలను మాకు అందించి మరింత దగ్గరకు చేసుకుంటున్నందుకు అభినందనలు. "

– యర్రగుంట్లపాటి శేషగిరిరావు, గుంటూరు

" ఎన్నో విజ్ఞానదాయకమైన విషయాలను శ్రీవాణి ద్వారా అందిస్తూ, సమాజాన్ని మరొక అడుగు ముందుకు వేయిస్తున్నందుకు అభినందనీయం. అశ్లీల సాహిత్యంతో సినిమా ఫొటోలతో, దిగజారిన కథలతో, తలా తోక లేని నవలలతో ప్రజలను ప్రక్కదారిన పట్టిస్తున్న పత్రికా ప్రపంచంలో ఓ వేగుచుక్కగా, జ్ఞానజ్యోతిగా తీసుకొని వస్తున్న మీ కృషికి ఎంతైనా అభినందనీయం ముఖ చిత్రాలు కూడా ఏంచి ఎంచి మంచివి, ప్రముఖులవి, జాతి స్మరింపవలసిన వారివి వేస్తున్నందుకు సంతోషము. "

– కొల్లూరి (ఎడిటర్, 'ఎక్స్‌రే') అమలాపురం

"మీదృష్టి దేనిమీదవున్నదో చూద్దామనుకొని ఇన్నాళ్ళు చందా పంపలేదు. మీరే గెలిచారు. చందా పంపుతున్నాను. లక్ష్యం మచిదయితే లక్ష్మి తనంతట తానే పరిగెత్తుకొని వస్తుంది. శ్రీ సత్యసాయిబాబాగారి ఆశీస్సులు అమోఘమైనవి, అద్భుతమైనవి. ప్రపంచాన్ని నడిపించగల పరమేశ్వరునికి మీ పత్రికను నడిపించడం ఒక లెఖ్ఖా ? అన్నీ స్వామియే చూచుకుంటారు. "

–ఎ. శ్రీనివాసరావు, లెక్చరర్, కావలి.

" శ్రీవాణి ప్రత్యేక సంచిక భగవాన్ బాబాగారి శుభాశీస్సులతో సమగ్ర పత్రికగా రూపురేఖలు దిద్దుకొంది. గత రెండు సంవత్సరాలలో తమరు చాలా ఉన్నత స్థాయికి ఎదిగారు. సంపూర్ణ మానవునిగా తీర్చిదిద్దడానికి అనువైన శీర్షికలను తీసుకొని చదువరులకు తృప్తిని కలిగిస్తోంది 'శ్రీవాణి.' "

–బోను వెంకటేశ్వరరావు, విజయవాడ.

" శ్రీవాణి ప్రత్యేక సంచిక చక్కటి వ్యాసాలతో, సాహితీ సాంస్కృతిక విలువలతో బాగుంది. "

–జ్యోత్స్న–రాయగడ్, ఒరిస్సా.

" శ్రీవాణి వార్షిక సంచిక సర్వకళా సంశోభితమై, సర్వజనాకర్షణీయముగా నున్నది. సనాతనమునుండి ఆధునికము వరకు, అన్నివర్గాల వారిని ఆనందింప జేయగల వ్యాసములతో సర్వశ్లాఘనీయముగా ఉన్నది. "

–మల్లాప్రగడ శ్రీ రంగారావు, బందరు.

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు : కొమరగిరి కృష్ణమోహనరావు

మార్చి - 1987

సంపుటి : 3

సంచిక : 3



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24–51 రామానాయుడుపేట

మచిలీపట్నం–521 001

ఫోన్ : 2818


| | | |
|---|---|---|
| విడి ప్రతి | : రు. | 3–00 |
| సంవత్సర చందా | : రు. | 36–00 |
| 2 సం॥ల చందా | : రు. | 66–00 |
| 4 సం॥ల చందా | : రు. | 116–00 |
| జీవిత సభ్యత్వం | : రు. | 500–00 |

Cheques & Drafts should be drawn in favour of SREEVANI, Monthly Machilipatnam


EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SPANDANA PRINTERS
MACHILIPATNAM


## విషయసూచిక



* ముఖచిత్రం *

చంద్రశేఖర ఆజాద్

# అజ్ఞాతవాసంలో వున్న మేధావి భావరాజు



శ్రీ భావరాజు నరసింహారావుగారు బందరులో అతి సామాన్య కుటుంబంలో జన్మించి, తన స్వశక్తితో సాహితీ కుటుంబంలో పెరిగి, అనేకమంది సాహితీవేత్తల అభిమానాన్ని చూరగొని ఈ మధ్యనే నాగార్జున విశ్వవిద్యాలయం వారిచేత గౌరవ డాక్టరేటు బిరుదును కూడా పొంది ఒక బందరు పట్టణమునకే గాక యావదాంధ్ర దేశానికే గర్వకారణమైనారనడంలో ఏమాత్రం అతిశయోక్తిలేదు.

"కృషితో నాస్తి దుర్భిక్షం" అన్న ఆర్యోక్తిని వీరు మరొక పర్యాయం ఋజువు చేసినారనడంలో ఏ మాత్రం సందేహంలేదు. చిన్ననాటనే తల్లిదండ్రులు పరమపదించినా, లక్ష్మియులు దూరమైనా, అండదండలు లేకపోయినా పట్టుదలతో విద్య నభ్యసించి, సాహితీ, సాంస్కృతిక రంగాలలో సముచితమైన స్థానాన్ని ఏర్పుచ్చుకొని 1930 లోనే "సారస్వత మండలి" ని స్థాపించి దానిద్వారా విశేషమైన సాహితీసేవ చేసిన మహనీయుడు. ఎంతో దూరదృష్టితో, విజ్ఞతతో 1934 లో శ్రీ విశ్వనాధ సత్యనారాయణగారిని సన్మానించి 'కవిసామ్రాట్' బిరుదును ప్రదానంచేసి సత్కరించిన ఘనత వీరికే దక్కింది.

షాత్రికేయుడుగా ప్రసిద్ధ ఆంధ్ర, ఆంగ్ల భాషా రచయితగా కీ. శే. కోలవెన్ను రామకోటేశ్వరరావు, కీ. శే. ముట్నూరి కృష్ణారావు పంతులుగార్ల అడుగు జాడలలో నడచి బందరు పట్టణ సాహిత్య, సాంస్కృతిక ఔన్నత్యాన్ని భావరాజుగారు యినుమడింపచేసారనడంలో ఏమాత్రం అతిశయోక్తిలేదు. కోలవెన్ను వారి 'త్రివేణి' ఆంగ్ల త్రైమాసిక పత్రికను చేబట్టి ఆనాటి నుండి నేటి వరకు నిర్విఘ్నంగా నడుపుతూ డా. కట్టమంచి, డా. గజేంద్రగడ్కర్, డా. సర్వేపల్లి లాంటి మేధావుల ప్రశంసల నందుకున్న మేధావి 'భావరాజు'

శ్రీనివాస శిరోమణి వాల్మీకి రామాయణం, శ్రీయామిజాల వారి భాగవతము, శ్రీ సోమయాజిగారి ఆంధ్రభాషా వికాసము, శ్రీ రాళ్ళపల్లివారి సారస్వతాభిలోకనము లాంటి ఉత్తమోత్తమ గ్రంథాలను మరియు కొన్నివందల సాహిత్య పుస్తకాలను ప్రచురించి తెలుగు వారికి అందించిన ఘనత వీరికే దక్కింది. వీరు అనేక విమర్శనా వ్యాసాలు వ్రాసి కృష్ణాపత్రిక, భారతి వంటి ప్రముఖ పత్రికలద్వారా అశేష ఆంధ్ర ప్రజానీకానికి పరిచయం అయినారు. వివిధ విషయాలపై సుమారు వంద ప్రసంగాలు చేసారు ఆకాశవాణిలో.

"కన్యాశుల్కం" లో రామప్పపంతులు పాత్రను ధరించి నటశేఖర డా॥ డి. వి. సుబ్బారావు, శ్రీ స్థానం నరసింహారావుల ప్రశంసల నందుకొనినారు. స్వామి వెంకటేశ్వరానంద వీరికి "విద్యా విశారద" బిరుదునిచ్చి సత్కరించడం చెప్పుకోదగ్గ విశేషం. వీరు విశ్వనాధగారి రచనానైపుణ్యాన్ని యువతరానికి అందించే ప్రయత్నంలో "కవిప్రభా" పేరుతో ట్రస్టును ఏర్పరిచి ప్రతి సంవత్సరం విశ్వనాధ రచనలమీద ప్రముఖుల ఉపన్యాసములను ఏర్పాటు చేయడం, ఒక ప్రముఖ పండితుడ్ని ఆనాడు

సన్మానించడం ప్రశంసించ దగిన విషయం. డెబ్బైయ్యవ పడిలో పడినప్పటికీ వీరు ప్రతినిత్యం "టెన్నిస్" ఆడడం వీరికి హాబీ.

జ్ఞానపీఠ పురస్కార నిర్ణాయక సంఘంలో, సాహిత్య అకాడమీలోను, ఆంధ్రనాటక కళాపరిషత్ లోను, ఆకాశవాణి సలహా సంప్రదింపుల సంఘంలోను, అధికార భాషా సంఘములోను మరియు ఇంకా అనేక సాహితీ సాంస్కృతిక సంఘములలో క్రియాశీలక సభ్యుడుగా వుంటూ, అమూల్యమైన సలహాల నందిస్తూ అనేకమంది ప్రముఖుల ప్రశంసల నందుకొనినారు.

ఒక్కమాటలో చెప్పాలంటే బందరు పట్టణ సారస్వత, సాహిత్య, సాంస్కృతిక వైభవానికి నేడు మనకు కనిపిస్తున్న వారసుడు 'భావరాజు'. కనీసం ఈనాటికైనా అజ్ఞాతవాసంలో వున్న ఈ మేధావిని నాగార్జున విశ్వ విద్యాలయం గౌరవించి 'డాక్టరేట్' బిరుదును ప్రసాదించి తెలుగువారికి వెలుగు చూపించినందుకు వారిని అభినందిస్తున్నాను.

— ఆర్. ఆర్. శర్మ


## శ్రీవాణి సాంస్కృతిక మాసపత్రిక

**FORM IV ( See Rule 8 )**

1. ప్రచురణ స్థలము : మచిలీపట్నం
2. ప్రచురణ ఎన్నాళ్ళకు : మాసమునకు
3. ముద్రాపకుని పేరు : కొమరగిరి కృష్ణమోహనరావు
4. ప్రచురణ కర్త : కొమరగిరి కృష్ణమోహనరావు
5. సంపాదకుని పేరు : కొమరగిరి కృష్ణమోహనరావు
6. చిరునామా : 24-51 రామానాయుడుపేట, మచిలీపట్నం
7. ముద్రణాలయము : స్పందన ప్రింటర్స్, 24-317 రామానాయుడుపేట మచిలీపట్నం
8. భాగస్తులు : ఎవరూ లేరు

కొమరగిరి కృష్ణమోహనరావు అనే నేను పై విషయములన్నియు యదార్థమని తెల్పుచున్నాను.

మచిలీపట్నం
28-2-1987

కొమరగిరి కృష్ణమోహనరావు
ప్రచురణకర్త సంతకం

శ్లో॥ హస్తౌ దానవివర్జితౌ, శ్రుతిపుటౌ శ్రేయః కథావర్జితౌ
నేత్రే దైవిక దర్శనేన రహితే పాదౌ న తీర్థం గతౌ
అన్యాయార్జిత విత్తపూరముదరం, గర్వేణ తుంగం శిరః
రే ! రే ! జంబుక ! ముంచ ముంచ సహసా నీచస్య నింద్యం వపుః

# అమృతవాణి

కూచిభట్ల చంద్రశేఖర శర్మ

సామాన్యంగా శ్మశానంలో మానవ శవాల్ని తగల బెటతారు. కొన్ని శవాల్ని భూమిలో పాతిపెట్టటం కూడా పరిపాటిగానే వుంటుంది. అది వాళ్ళ వాళ్ళ సంప్రదాయాన్ని బట్టి వుంటుంది. కొన్ని దిక్కులేని శవాలకు తిన్నగా సంస్కారమే జరగదు కూడాను. పాతిపెట్టాల్సిన శవాలను పాతిపెట్టి బంధువులు వెళ్ళిపోయిన తర్వాత నక్కలు ఆ శవాల్ని కుళ్ళగించి బయటికి లాగుతాయి. శవాలను పీక్కొని తినటానికే శ్మశానాల్లో యెక్కువగా నివసిస్తూంటాయి, నక్కలు.

ఒకసారి ఒక శ్మశానంలో పడివున్న మానవ కళేబరాన్ని తినటానికి యెంతో ఆసక్తితో వచ్చిందో నక్క. ఛీ ఛీ ఆ పాపిష్ఠి శవాన్ని తినకు వదిలెయ్య అని ఆ నక్కను వారించిందొక గద్ద. ఎందుకు వారించిందయ్యా అంటే–

ఈ కళేబరం ఒక నీచ మానవునిది. ఆ జీవుడంత పాపాత్ముడు మరోడు లేడు. బ్రతికివున్న రోజుల్లో వాడు సంపాదించిన పుణ్యమే లేదు. వాడి చేతులు ఏనాడూ ఇంత దానం ధర్మం చేసుకున్నవి కావు. ఇక చెవులు పారమార్థిక విషయాల నెప్పుడైనా వింటేగా! పోనీ కళ్ళున్నాయిగా! అవైనా భగవంతుని దివ్యదర్శనం చేసుకున్నాయా! అంటే అదీ లేదు. సరే యే పుణ్య తీర్థాలకైనా వెళ్ళి తరించవచ్చుగా అంటే అందుకు అతని పాదాలు కదిలితేగా! ఎప్పుడూ వెధవ పొట్ట నింపుకోటంతోనే సరిపోయింది. అదైనా న్యాయంగా సంపాదించుకొన్న ధనంతో కాదు. గర్వం మాత్రం కావలసినంత వుంది. అందుకనే తల పైకెత్తుకొని తిరిగాడీ జీవుడు. గర్వంతో కళ్ళు నెత్తికెక్కాయి. ఇలాంటి నీచుడీ జీవుడు కనుకనే యితని యీ కళేబరం దూష్యమైంది. ఏహ్యమైంది.

కనుక ఓ నక్కా ! ఇంత నీచుని పాపిష్ఠి శరీరాన్ని వెంటనే వదిలేసి యివతలకు రా ! ఛీ ఛీ దాన్ని ముట్టుకోమాకు. అని హితం చెప్పింది.

ఎంతో పుణ్యం చేసుకుంటేగాని మానవ శరీరం ప్రాప్తించదు. తీరా ప్రాప్తించిన తర్వాత సార్థకం చేసుకోటానికి భక్తి ప్రపత్తులతో జీవితం ధన్యం చేసుకోవాలి. అలా కాక జంతువులాగా జీవితం గడిపితే తరించకపోగా పాప పంకిలమైన బ్రతుకు భారంగా గడపాల్సి వస్తుంది. భగవంతుడు మానవునికి చక్కగా కరచరణాద్యవయవాలిచ్చింది భగవత్సేవకని గుర్తించి ప్రవర్తిస్తేనే మానవుడు ధన్యుడవుతాడు. కనుకనే "కంజాక్షునర్చించు కరములు కరములు" అంటూ భాగవతం ప్రబోధించింది. ఇలా సార్థకం కాని మనిషి శవాన్ని నక్కలు కూడా ముట్టుకోవు. అప్పుడు కూడా ఇతరుల కుపయోగించడని భావ

శ్రీవాణి

ముఖచిత్ర వ్యాసం

# వీర విప్లవ శేఖరం చంద్రశేఖర ఆజాద్

– కొమరగిరి కృష్ణమోహనరావు

అవి స్వాతంత్ర్యోద్యమ దినాలు. రవి అస్తమించని సామ్రాజ్యాన్ని పరిపాలిస్తున్న ఆంగ్లేయులను భారత గడ్డ మీదనుండి పారద్రోలడానికి బ్రహ్మాండమైన మహోద్యమం జరుగుతున్న రోజులవి. సహాయ నిరాకరణోద్యమంలో వేలాదిమంది పిన్నలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు పాల్గొంటున్న రోజులవి. "వందేమాతరం" నినాదం దేశంలో ఏ మారుమూల కెళ్ళినా మారుమ్రోగుతున్న దినాలవి. "భారతమాతాకీ జయ్" అని గర్జిస్తూ జన ప్రవాహం పరవళ్ళు త్రొక్కుతున్న విప్లవ దినాలవి. స్వార్థంతో, సంకుచితతత్వంతో తమ విష కబంధ హస్తాలలో ఇరికించుకొని, అమాయక ప్రజలను పీడిస్తూ, బాధిస్తూ, భారతదేశ సంపదను కొల్లగొట్టి తమ దేశానికి తరలించుకొని వెళ్ళుతున్న దుర్దినాలవి.

స్వాతంత్ర్యం నా జన్మహక్కు అని సింహగర్జన చేశాడు బాల గంగాధర తిలక్.

ఆ గర్జన విని యువలోకం ఉవ్వెత్తున లేచింది. నూనూగు మీసాలు కూడా రాని ఎంతోమంది యువకులు ఉరికంబాల కెక్కారు. తెల్లదొరల తుపాకీ గుండ్లకు బలై పోయారు. వేలాదిమంది కారాగారాలలో క్రుక్క బడ్డారు. అయినప్పటికీ యువలోకం ఏమాత్రం వెనుకంజ వేయలేదు. బ్రిటీషువారిని పారద్రోలేంతవరకు మహోద్యమం కొనసాగుతునే ఉన్నది.

## బాలచంద్రశేఖర్

అది 1921 డిశంబరు 26 వ తేది. సహాయ నిరాకరణోద్యమం ముమ్మరంగా జరుగుతున్న రోజులవి "వందేమాతరం– భారతమాతాకీజై" అంటూ నినాదాలిసూ పెద ఊరేగింపు బయలుదేరింది. పరమ పవిత్రమైన వారణాసి నగరంలో ఆ ఊరేగింపు ఒక కూడలి వద్దకు చేరింది. యువకులు మిన్నుముట్టేట్లుగా నినాదాలిస్తున్నారు. అక్కడ హఠాత్తుగా ఒక పోలీసు వాహనం ప్రత్యక్షమైంది. దానిలోనుండి పోలీసులు లాఠీలతో దిగారు. "ప్రజలారా! వెంటనే చెదిరిపోండి! లేకపోతే మా లాఠీ దెబ్బలను చవిచూడవలసి వస్తుంది" అని బిగ్గరగా హెచ్చరిక చేశారు పోలీసులు. "వందేమాతరం" నినాదపు హోరులో ఆ పోలీసుల హెచ్చరికను ఎవరూ పట్టించుకోలేదు. పోలీసులు అవమానంగా భావించారు పోలీసు అధికారి నోటినుండి "చార్జ్!" అనే హెచ్చరిక రావడం తోనే, నిర్దాక్షిణ్యంగా పోలీసులాఠీలు ప్రదర్శకుల మీద విరుచక పడ్డాయి. తలలు పగిలి నెత్తురు ప్రవహించడం ప్రారంభించింది. అయినా నినాదాల హోరు మాత్రం తగ్గలేదు. పోలీసు అధికారి కూడా లాఠీతో వాన్ దిగి, జండాపుచ్చుకొని నినాదాలిస్తున్న ఒక వృద్ధుని మీదకు దూకాడు. ఇష్టంవచ్చినట్లుగా కొట్టాడు. ఆ దెబ్బలకు తట్టుకోలేక ఆ వృద్ధుడు క్రిందపడి పోయాడు. అయినప్పటికీ 'వందేమాతరం' ఆ నోటి నుండి మాత్రం ఆగలేదు. ఆ దృశ్యాన్ని చూస్తున్న 14 సంవత్సరముల బాలుడి కంటి వెంబడి అప్రయత్నంగా కన్నీరు కారింది. ఆ పోలీసు దురాగతాలను చూస్తూ ఊరుకోలేక పోయాడు. ఒక కంకరరాయిని తీసుకొని ఆ పోలీసు అధికారి వైపుకు విసిరాడు గురితప్పకుండా ఆ రాయి ఆ అధికారి మొహాన పడి రక్తం చిందింది. అప్పటి వరకు ప్రయోగిస్తున్న లాఠీ తక్కున ఆగిపోయింది. తల గిర్రున తిరిగింది. నిలద్రొక్కుకొని, కారుతున్న రక్తాన్ని తుడుచుకొని, రాయి వచ్చిన దిశకు చూచాడు ఆ పోలీసు అధికారి.

## సంకెళ్ళు

అప్పటికే ప్రజలు చెల్లాచెదరైనారు. ఆ రాయి విసిరిన బాలుడు మాత్రం రీవిగా రొమ్ము విరిచి నిలబడి ఆ పోలీసు అధికారివైపే తీక్షణంగా చూస్తూ నిలబడ్డాడు. ఆ పోలీసు అధికారి అవస్థను చూచిన ఆ బాలుడి ముఖం మాత్రం చిరునవ్వుతో చిందులాడుతున్నది. ఆ బాలుని చూచిన ఆ పోలీసు అధికారికి వళ్ళంతా తేళ్ళు ప్రాకినట్లయింది. "పట్టుకోండి .. పట్టుకోండి...." అని బిగ్గరగా అరిచాడు ఆ అధికారి. పోలీసులు వెంటబడ్డారు. ఆ బాలుడు సందులు గొందులూ త్రిప్పాడు. కాశీ విశ్వేశ్వరుని చుట్టూ ప్రదక్షిణం చేయించాడు. పోలీసులు విసిగిపోయారు. విద్యార్థి నిలయాలు, ధర్మశాలలు, శివాలయాలు అన్నీ పోలీసుల దౌర్జన్యానికి బలియైనాయి.

పోలీసులు తిరిగి తిరిగి "జ్ఞానవాపి మొహల్లా" దగ్గరకు చేరారు. అక్కడ "పుతలివావె" శివాలయముంది. అక్కడొక గదిలో కాశీ విద్యార్థుల సంఘ కార్యాలయముంది. "ఛాత్ర సమితి" కార్యాలయం అది. పోలీసులు ఆ గదిలో ప్రవేశించారు. అక్కడ నున్న లోకమాన్య తిలక్ పటమును చూచి దానిని పగలుగొట్టారు. తిలకం ధరించిన ఆ బాలుడక్కడ ప్రత్యక్షమైనాడు. సంకెళ్లు వేయమని అధికారి ఆజ్ఞాపించాడు. ఏమాత్రం భయపడకుండా రెండు చేతులూ చాచాడు ఆ బాలుడు. సంకెళ్ళు వేసి వీధులలో నడిపిస్తూ పోలీసు స్టేషన్‌కు తీసుకొని వెళ్ళి, నోటికి వచ్చినట్లు తిట్టి, కొట్టి గదిలోనికి త్రోసి తాళం వేశారు. అది చలికాలం. కప్పుకోడానికి గాని, ప్రక్క వేసుకోవడానికి గాని, గుడ్డలేమీ ఇయ్యలేదు. గది నిండా దుమ్ము, పైగా నల్లులు, పైన దోమలు. అర్ధరాత్రయినా ఆ బాలునికి నిద్ర పట్టలేదు. కాపలా కాస్తున్న పోలీసులు మాత్రం ఉన్ని దుస్తులను ధరించి, పొగ త్రాగుతూ రీవిగా పహరా కాస్తున్నారు. వారు చలితో వణుకుతున్న బాలుణ్ని చూచి వెక్కిరించాలనుకున్నారు. ఆ గది వద్దకు వచ్చి బేటరీలైటు వేశారు. ఆ దృశ్యం చూచి ఆశ్చర్యపోయారు. ఆ బాలుడు వంటిన వున్న బట్టలను తీసివేసి, లంగోటితో వ్యాయామం చేస్తున్నాడు. పోలీసులు హుంకరించారు. బాలుడు ఏమాత్రం బెదరక వ్యాయామం చేస్తూనేవున్నాడు. క్షమార్పణ చెప్పుకుంటే వదిలిపెడతామన్నారు. బాలుడు కనీసం సమాధానంకూడా చెప్పలేదు. పోలీసులు చేయగలిగేదేమీ లేక తిరిగి వెళ్ళిపోయారు.

మరునాడు ఆ బాలుణ్ణి న్యాయస్థానమునకు తీసుకొని వెళ్లి కోర్టులో హాజరు పరుస్తారు. అక్కడి న్యాయాధికారి పేరు "ఖరేఘాట్" ఆంగ్లేయుల తొత్తు. అదే సమయానికి సత్యాగ్రహంలో పాల్గొన్న మరో ఆరుగురు విద్యార్థులను కూడా ఆ న్యాయస్థానమునకు పోలీసులు తీసుకొని వస్తారు. ఆ ప్రదేశమంతా జనంతో కిక్కిరిసిపోయివుంటుంది. పోలీస్‌వాన్ నుండి తీసుకొని వస్తున్న బాలుడి మీద అందరి దృష్టి పడుతుంది. చూడటానికి చిన్న విగ్రహం. రీవి మాత్రం సింహ సదృశం. రొమ్ము విరిచి నడుస్తున్న తీరు మాత్రం ఉత్తేజాన్ని కలుగజేస్తుంది. న్యాయాధికారి తన ఆసనం మీద కూర్చున్నాడు. సంకెళ్లు ధరించిన ఆ బాలుడు రీవిగా బోనెక్కి నిలబడ్డాడు. అంతా నిశ్శబ్దం.

న్యాయాధికారి నోటి వెంబడి వచ్చిన కర్కశమైనధ్వని ఆ ప్రశాంత వాతావరణాన్ని ఛేదించివేసింది.

"నీ పేరేమిటి ?" అని అడిగాడు న్యాయాధికారి. ఆ బాలుడు తీక్షణంగా అతని వైపుకు చూస్తాడు. రొమ్ము విరిచి గంభీర స్వరంతో "నాపేరు .. ఆజాద్"(అంటే 'స్వేచ్ఛ' అని అర్థం) అని సదురు బెదురు లేకుండా గట్టిగా సమాధానం చెబుతాడు. చుట్టూవున్న ప్రేక్షకజనం ఆనందంతో చప్పట్లు కొడుతారు. న్యాయాధీశుడు అవమానంగా భావించి "నిశ్శబ్దం నిశ్శబ్దం" అని చేతిలో నున్న సుత్తితో టేబులుపై కొడుతాడు.

"నీ తండ్రి పేరు ఏమిటి ?" అని మరల న్యాయాధీశుడు అడుగుతాడు.

ఆ బాలుడు చిరునవ్వుతో "స్వాధీన్" (అంటే స్వాతంత్ర్యం) అని సూటిగా, నిర్భయంగా సమాధానం చెబుతాడు. మళ్ళీ కరతాళధ్వనులు మిన్ను ముట్టాయి. దాంతో న్యాయాధీశుడు మరింత రెచ్చి పోతాడు. కోపాన్ని తమాయించుకొని "సరీగా చెప్పు : నీగృహం ఎక్కడ" అని అడుగుతాడు. అప్పుడు ఆ బాలుడు ప్రశాంతంగా "నా గృహం ...కారాగృహం...." అంటాడు. అందరూ నివ్వెరపోతారు న్యాయస్థానమంతా "వందేమాతరం.... భారతమాతాకీజై" అనే వినాదాలతో మార్మ్రోగి పోతుంది న్యాయాధీశుడు మాత్రం దెబ్బతిన్న నాగు పాములా బుసకొడుతుంటాడు. "ఖరేఘాట్" తన తీర్పును చదువుతాడు. పరిపాలకులకు వ్యతిరేకంగా పోరాటానికి పూనుకున్నందుకు, ఆ బాలుడికి పదహారు బెత్తం దెబ్బలు శిక్ష విధిస్తాడు. సెంట్రల్ జైలుకు పోలీసులు ఆ బాలుడ్ని తీసుకొని వెళుతారు.



## పదహారు దెబ్బలు

అది 1921 సం. డిశంబరు 28 వ తేది కోర్టు శిక్షను అమలుపరచవలసిన దుర్దినం అది. కొన్ని గంటల ముందే ఒక బెత్తం నీటిలో నానుతూ ఉంది. ఆ బాలుడి శరీరం మీద లంగోటి మినహా మిగతా బట్టలన్నీ ఊడ తీస్తారు చేతులు రెండు పైకెత్తి త్రాడుతో బిగించి కట్టారు పిల్లవాడు మాత్రం చలించకుండా ధైర్యంగా కొదమ సింహంలా వాడి చూపులతో చూస్తున్నాడు. వయస్సు చిన్నదైనా వ్యాయామము చేసిన శరీరం కావడం వలన దృఢంగా నే ఉన్నది రొమ్ము విరిచి ఠీవిగా నిలుచున్నాడు వైద్య పరీక్ష ప్రారంభమైంది. వైద్యుడు నాడిని పరీక్షించాడు. స్టెతస్కోప్‌తో గుండెను చూచాడు, ఓ. కె. అన్నాడు. భీముడిలాంటి జైలు జవాను బెత్తం ఆడిస్తూ ఆ పసి బాలుడుమీద దూకుతాడు. చర్మం చీలిపోయి, రక్తం ప్రవహించ నారంభించింది. దెబ్బపై దెబ్బ పడుతున్నది. ఆ బాలుడి నోటి వెంబడి ఏడుపు కాదు వచ్చేది, "భారత మాతాకీ జై" అనే సింహ గర్జన. ఆ సింహగర్జనతో ఆ జైలంతా ప్రతిధ్వనించింది. జైలు గదుల కిటికీల్లోంచి అనేకమంది ఖైదీల ముఖాలు తొంగి చూచాయి. అధికారి దెబ్బలను లెక్క పెడుతున్నాడు. ఆ బాలుడి నోటి వెంబడి మాత్రం "వందేమాతరం .... భారతమాతాకీ జై" నినాదాలు వినిపిస్తున్నాయి పదహారు దెబ్బలు మీద పడ్డాయి వళ్ళంతా రక్తసిక్తమైపోయింది. "వందేమాతరం" అని ఆ బాలుడు చివరిసారిగా గర్జించి మూర్ఛిల్లాడు. అంతులేని బాధతో, అలసటతో, తాళ్ళతో చేతులు కట్టి వ్రేలాడ తీసినందువలన మాతృభూమి వడిలో విశ్రాంతి తీసుకొనే అవకాశం లేక స్పృహతప్పి వ్రేలాడసాగాడు.

## మూడు అణాలు

మరుసటి రోజు ఉదయం జైలునుండి పంపేముందు జైలు అధికారి, వారి సాంప్రదాయం ప్రకారం మూడు అణాలు చేతిలో పెట్టాడు. ఆ బాలుడా డబ్బును చేతిలో పట్టుకొని ఒకక్షణం చూచాడు అంతే .... ఆ చేతిలో వున్న మూడు అణాలలో మాతృదేవి బానిసమైన దృశ్యం

అతనికి కనిపించింది. ఆ డబ్బులను విసిరి నేలకేసి కొట్టాడు. " వందేమాతరం " అని సింహగర్జన చేశాడు. జైలు అధికారులు నిశ్చేష్టులైనారు అతి కష్టంతో కాళ్ళీడ్చుకుంటూ నడువసాగాడు. గాయాలు చిట్లి రక్తం కారుతున్నది. ఇంతలో గౌరీశంకరశాస్త్రిగారు వచ్చి, ఆప్యాయంగా తన ఇంటికి ఆ బాలుడ్ని గొనిపోయి మందులిచ్చి భోజనం పెడుతాడు. మరుక్షణంలో ఈ విషాద వార్త కాశీ నగరమంతా వ్యాపించి, వేలాదిమంది ఆ బాలుణ్ణి చూడడానికి వచ్చారు. ఆ సాయంకాలానికి బ్రహ్మాండమైన సభను ఏర్పర్చి ప్రముఖ నాయకు లందరూ వేదిక మీద ఆశీనులైనారు ఆ బాలుడు వేదిక పైకి రాగానే " వీర బాలక్ కి జై ....వందేమాతరం.... భారతమాతాకీ జై " నినాదాలు మిన్ను ముట్టాయి వక్తలు ఆ బాలుని ధైర్య సాహసములను మెచ్చుకుంటూ సుదీర్ఘ ప్రసంగాలు చేశారు. నాటినుండి ఆ బాలుని "ఆజాద్" అని పిలువనారంభిచారు. అతనే మన " చంద్రశేఖర ఆజాద్. "

## బాల్యం

అతని అసలు పేరు "చంద్రశేఖర శర్మ". క్రీ. శ. 1906 సం. జూలై 28 వ తేదిన జన్మించాడు. తండ్రి సీతారాం తివారీ. తల్లి జగరాణీదేవి తివారీ ఇంటిపేరు కావడం వలన అతనిని " చంద్రశేఖర్ తివారి " అని మొదట్లో పిలిచేవారు. అతి పేద కుటుంబంలో జన్మించడం వలన కాశీలో చదువుకునే రోజులలో ఒకపూట భోజనం మాత్రమే చేసి కాలం గడిపేవాడు.

## జలియన్ వాలా భాగ్

ఆజాద్ విప్లవకారుడిగా తయారు కావడానికి జలియన్ వాలాబాగ్ సంఘటన దోహదం చేసింది. 1919 ఏప్రియల్ 12 వ తేదీన అనగా శ్రీరామ నవమినాడు అమృతసర్ లో డా॥ సత్యపాల్, డా॥ సైఫుద్దీన్ కిచ్లూలను ప్రభుత్వం బంధించి నగరం సరిహద్దు దాటించి ఎక్కడికో తీసుకొని వెళ్ళారు. మరుసటి రోజు 13 వ తేదీన జలియన్ వాలాబాగ్ లో నిరసన సభ జరుపాలని ప్రజలు నిర్ణయించారు. జలియన్ వాలాబాగ్ గుండ్రంగా శిధిలమైన కట్టడాలతో, చుట్టూ ఎత్తైన గోడలతో, చిన్న చిన్న ద్వారాలతో ఉండేది. ఆ సాయంకాలం సుమారు 20 వేల మంది పెద్దలు, పిన్నలు; స్త్రీలు, పురుషులు సమావేశమైనారు. ఈ సంగతి తెలిసిన బ్రిగేడియర్ జనరల్ డయ్యర్ వాళ్ళకు గుణపాఠం చెప్పాలని తుపాకులు లారీలతో పోలీసు సిబ్బంధిని దింపాడు. ఇరుకు వాకిళ్ళవద్ద, సందులలో, గోడలపైన సైన్యాన్ని సిద్ధం చేశాడు. ముందు హెచ్చరికలు చేయకుండా కాల్పులు ప్రారంభించాడు. నాలుగు దిక్కుల నుండి ఒకే పర్యాయం తుపాకీ గుండ్ల వర్షం కురిపించాడు. హాహాకారాలు చెలరేగాయి. ఎందరో అమాయకులు కన్నుమూశారు. ఆ ప్రదేశమంతా రక్తం ఏరులై పారింది. మొత్తం 1650 గుళ్ళను ఆనాడు సైనికులు కాల్చారు. 37 మంది వీరమరణం పొందారు. 1137 మంది గాయపడ్డారు. 134 గుండ్లు మాత్రమే వ్యర్ధమైనాయి. అమృతసర్ తల్లడిల్లిపోయింది. ప్రతి భారతీయుడు నేల మీద ప్రాకుతూనే వెళ్ళాలని ఆదేశించాడు 'డయ్యర్' లేకపోతే బట్టలు విప్పి కొరడాలతో కొడతారని హెచ్చరించాడు, యావత్ భారతదేశం ఈ సంఘటనతో స్పందించింది. యువలోకం సవాలుగా స్వీకరించింది. దేశమంతా నిరసన ప్రదర్శనలు జరిగాయి చంద్రశేఖర ఆజాద్ మనస్సు వికలమైంది. దెబ్బ తిన్న త్రాచులా బుసలు కొట్ట నారంభించాడు. గెరిల్లా పద్ధతి ద్వారానే ఆంగ్లేయులను హతమార్చాలని నిర్ణయించుకున్నాడు. "హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లిక్" అనే విప్లవ సంస్థను ప్రారంభించి, యువకులకు శిక్షణ ఇవ్వడం ప్రారంభించాడు.

## కాకోరీ దోపిడి

అజ్ఞాతవాసంలో యువకులకు శిక్షణ ఇవ్వడం అంత తేలిక కాదు. తుపాకులు, పిస్టల్స్ కావాలి. చేతి బాంబులు తయారు చేయాలి. వాళ్ళకు తిండి పెట్టాలి. వీటన్నిటికి డబ్బు కావాలి. ధనవంతులైన భారతీయులను దోచడం

న్యాయం కాదని 'ఆజాద్' భావించాడు. ఆంగ్లేయ ప్రభుత్వ ఖజానాను కాజేయడం ఒక్కటే సబబని నిర్ణయించుకున్నాడు. పథకం రూపొందించాడు. రైలులో వెళ్ళుతున్న ఖజానాను దొంగిలించాలని నిర్ణయించాడు. భారతీయులైన వారిని ఎవర్నీ కాల్చరాదని ఆదేశించాడు. తన పథకానికి మారుమూల నున్న 'కాకోరి' రైల్వే స్టేషన్‌ను ఎన్నుకొన్నాడు. అంతా సిద్ధం చేశాడు. షహజాన్‌పూర్ నుండి వచ్చిన రైలు కాకోరి స్టేషన్‌లో ఆగింది. పథకం ప్రకారం ఆజాద్ నాయకత్వంలో ఐదుగురు యువకులు పిస్టళ్ళతో రైలు ఎక్కారు. రైలు కదిలింది. అపాయక సూచన గొలుసును ఒక యువకుడు లాగాడు. సిగ్నల్ పోస్టువద్దకు వచ్చి రైలు ఆగింది. కొంతమంది గార్డు వైపుకు పరిగెత్తారు. "ప్రయాణీకులారా! మీకేం అపాయం లేదు. ఎవరూ దిగకండి! దిగారా కాల్చేస్తాం. ప్రయాణీకుల సొమ్మును దోచుకోవడం మా అభిమతం కాదు. భారతీయులను దోచుకుంటున్న బ్రిటీష్ ప్రభుత్వ ఖజానాను మాత్రమే దోచుకుంటాం" అని ఆజాద్ పిస్టల్ చూపించి సింహగర్జన చేశాడు. ఎక్కడివారక్కడే అచేతనంగా నిలబడి పోయారు. ఖజానా ఇనుప పెట్టెను క్రిందకు దింపారు. సుత్తితో పగుల గొట్టారు. దానిలో నున్న డబ్బు సంచులను తమ తువాళ్ళలో కట్టుకొని ప్రక్కనే ఉన్న దట్టమైన అడవిలోనికి పారిపోయారు. చివరికి లక్నో పట్టణానికి చేరుకున్నారు. క్షణంలో పోలీసులకు ఈ దోపిడీవార్త చేరింది. ప్రభుత్వం దీనిని సవాలుగా స్వీకరించింది. గూఢచారులను నలువైపులా పంపించింది. కాకోరి దోపిడీ జరిగిన తరువాత పోలీసుల నిఘా విప్లవ వీరుల స్థావరాల మీద ఎక్కువైంది. ఈ దోపిడీలో పాల్గొనిన అస్ఫాక్, బక్షీ మొదలగువారు పట్టుబడ్డారు. ఆజాద్‌ను మాత్రం పట్టుకోలేకపోయారు. చివరికి కాశీకి చేరుకున్నాడు ఆజాద్.

## అపూర్వ కలయిక

కాన్పూరులో జరిగిన ఒక విప్లవకారుల సమావేశంలో భగత్‌సింగ్, ఆజాద్‌ల అపూర్వ కలయిక జరిగింది.

"శ్రీవాణి" జీవితసభ్యులు



**శ్రీ పి. రంగనాయకులు**
చైర్మన్ "ఆప్కో"
హైద్రాబాద్

దీనితో విప్లవకారుల చరిత్రలో ఒక అపూర్వ అధ్యాయం ప్రారంభమైంది. మొదటి లాహోర్ కుట్ర కేసులో కర్తార్‌సింహ్ ఉరికంబమెక్కాడు. అనాడు ఆయన అంతిమ సందేశం "ఛలో ఛల్ యే దేశ్ను యుద్ధకరాన్, ఏహో ఆఖరి వచన్ తే ఫర్మాన్ హోగయే" (దేశం కోసం పోరాడటానికి పదండి! ముందుకు పదండి! ఈ అంతిమ వచనమే మీకిచ్చిన ఆజ్ఞ అని భావించండి). అది భగత్‌సింగ్‌కు స్ఫూర్తి నిచ్చింది, జలియన్ వాలాబాగ్ దుస్సంఘటన ఆజాద్‌కు కర్తవ్యాన్ని ప్రబోధించింది. వీరిరువురి కలయిక విప్లవకారులకు ఉత్సాహ ప్రోత్సాహాల నిచ్చింది. వీరిలో సుఖదేవ్, రాజగురు, విజయకుమార్‌సిన్హా, ఫణీంద్రఘోష్, కుందన్‌లాల్ గుప్త, భటుకేశ్వరదత్, రోషన్‌సింగ్, అష్ఫర్, రాజేంద్రలాహిరీ .... మరి ఎందరో యువ కిశోరాలు చేతులు కలిపారు, వీరలకు ఆజాద్ నాయకుడు. ఆజాద్‌కు కుడి భుజం భగత్‌సింగ్. అనేక రహస్య సమావేశాలు జరుపుతూ, విప్లవ సాహిత్యాన్ని ప్రచురించి ప్రచారం

చేస్తూ, కార్యకర్తలకు రైఫిల్ ట్రయినింగ్‌లను ఇస్తూ పోరాటాన్ని వీరోచితంగా కొనసాగించారు.

## సైమన్ కమీషన్

సైమన్ కమీషన్ 1928 ఫిబ్రవరి 3 వ తేదిన బొంబాయి రేవులో దిగింది. లక్షలాదిమంది బొంబాయి రేవు బయట నల్లజెండాల ప్రదర్శన జరిపారు. లక్నోలో పండిత నెహ్రూ నాయకత్వంలో నిరసన ప్రదర్శన జరిగింది. పండిత నెహ్రూ వీపుపై స్వాతంత్ర్య పోరాటపు మొట్టమొదటి లాఠీదెబ్బ ఆనాడు పడింది. 1928 అక్టోబర్ 20 వ తేదీన సైమన్ కమీషన్ లాహోరు వచ్చినప్పుడు పంజాబ్ కేసరి లాలాలజపతిరాయ్ నాయకత్వాన బ్రహ్మాండమైన నల్ల జెండాల ప్రదర్శన జరిగింది. "సైమన్ హటావ్" నినాదాలు మారుమ్రోగాయి. లాలాజీ ప్రళయకాల రుద్రునివలె ఆ నిరసన ప్రదర్శన అగ్రభాగాన నిలచి "సైమన్ గో బ్యాక్" అంటూ పంజాబు కేసరి సింహగర్జన చేసింది. అది విని బ్రిటీష్ అధికారులు భయ కంపితులైనారు. ఇసుక వేస్తే రాలనంతటి జనసమూహం అక్కడ చేరింది. పోలీస్ సూపరింటెండెంట్ స్కాట్ "ప్రజలారా! చెదరిపోండి" అని హెచ్చరిక చేశాడు. ఎవరూ పట్టించుకోలేదు. "చార్జ్" అని స్కాట్ నోటి నుండి ఆజ్ఞ వెలువడింది. పోలీసుల పైశాచిక కృత్యాలు ప్రారంభమైనవి. స్వైర విహారం చేస్తారు. పోలీసు లాఠీలు నిరపరాధులమీద విరుచుకుపడ్డాయి. రక్తం ప్రవహించింది. ప్రజలు ప్రశాంతంగా దెబ్బలు తింటూ కూడా "సైమన్ గో బ్యాక్, సైమన్ హటావ్" నినాదాలు యిస్తూనే ఉన్నారు. స్యాండర్స్ కొట్టిన లాఠీ దెబ్బకు లాలాజీ గొడుగు కర్ర విరిగిపోయింది. దెబ్బపై దెబ్బ పడటంతో లాలాజీ దేహం చిట్లి రక్తం ప్రవహింప నారంభించింది. చేతులు కాళ్ళు విరిగినవారు, శరీరం చిట్లినవారు, బుర్రలు పగిలినవారు ఆనాడు ఎందరో .... లాహోర్ పట్టణం స్మశాన వాటికగా మారింది. మొత్తం నగరం హర్తాళ్‌ను పాటించింది. ఆనాడు సాయంత్రం జరిగిన నిరసన సభకు వేలాదిమంది హాజరైనారు. పంజాబు కేసరి వేదిక ఎక్కడంతో జనం యిచ్చిన అభినందన నినాదాలతో మారుమ్రోగింది. ఆనాడు పంజాబు కేసరి చేసిన సింహగర్జన చరిత్రపుటలలో శాశ్వతంగా నిలిచిపోతుంది. ఆ హెచ్చరిక స్వాతంత్ర్యోద్యమానికి స్ఫూర్తి నిచ్చింది. "జ్ఞాపకముంచుకోండి! ఇలాంటి ప్రభుత్వం నిలువదు. ఇదిగో నేనిప్పుడు ప్రకటిస్తున్నాను ఈ రోజు నా దేహంపైబడిన దెబ్బలు ప్రతి ఒకటి భారతదేశంలో ఆంగ్లేయుల పరిపాలనయొక్క శవ పేటికకు కొట్టబడిన చిట్టచివరి మేకులవుతాయి. జాగ్రత్త!" అని హూంకరించారు.

## లాలాజీ మరణం

సభానంతరం లాలాజీ మంచం పట్టారు. సాండర్స్ కొట్టిన దెబ్బల ఫలితంగా లాలాజీ 1929 నవంబరు 17న ప్రాణాలు విడిచారు. దుఃఖావమానాలతో కృంగిపోయిన వేలాదిమంది ప్రజలు శవ యాత్రలో పాల్గొన్నారు. రావీ నదీ తీరంలో చితి ఏర్పాటు చేశారు. అగ్నిజ్వాలలు లాలాజీని తనలోనికి చేర్చుకున్నాయి. ప్రజలందరూ శ్మశాన వాటికను వదలి వెళ్ళినా, యిద్దరు యువకులు మాత్రం రాత్రంతా అక్కడే కన్నీరు కారుస్తూ కాలక్షేపం చేశారు. వారే భగవతీచరణ్, యశ్‌పాల్‌లు. ఒక చంప స్మశానంలో లాలాజీ మృతశరీరాన్ని దహించివేస్తున్న చితిమంటలు. మరొక చంప విప్లవవీరుల హృదయాలలో చెలరేగుతున్న ప్రతీకార జ్వాలలు. "పగ! పగ!" హృదయాలు ఆక్రోశింప నారంభించాయి. చిత్తరంజన్‌దాస్ పత్ని బసంతీదేవి ఆనాడు జరిగిన సంతాప సభలో ప్రళయకాల రణ చండికగా గర్జించింది. "ఈ దేశంలో పురుషత్వం, యౌవనములు ఇంకా జీవించే ఉన్నాయా? నేనీ భరతవర్షపు స్త్రీగా ఈ ప్రశ్నకు స్పష్టమైన జవాబును ఆశిస్తున్నాను. మన ప్రియతమ లాలాజీ చితి మంటలు చల్లారేలోపుగానే యువకులు దీనికి జవాబు యివ్వాలి" అని సవాలు విసిరింది. యువలోకంలో కల్లోలం చెలరేగింది. ప్రతీకారవాంఛ

ప్రబలింది. భగత్ సింగ్ సహచరులలో పట్టుదల పెరిగింది. లాలాజీ చనిపోయిన కొన్ని రోజుల తరువాత ఆజాద్ లాహోర్ చేరారు. సుఖదేవ్, శివశర్మలు కూడా వచ్చారు.

## స్యాండర్స్ హత్య

1928 డిశంబరు 10 న లాహోర్‌లోని " బోర్డుంగ్ హౌస్ "లో విప్లవకారులు సమావేశమయ్యారు. దీనిలో ఆజాద్, భగత్ సింగ్, సుఖదేవ్, మహావీరసింహ, కైలాసపతి, కందన్‌లాల్, రాజగురు, యశపాల్‌లు ప్రముఖులు. లాలాజీకి జరిగిన ఘోర అన్యాయం ప్రపంచానికి తెలియజెప్ప ప్రతీకారం, పగ తీర్చుకోవాలన్నాడు భగత్‌సింగ్.

కేవలం పగ తీర్చుకోవడమే గాక, దీనివల్ల ప్రజలలో ఆత్మవిశ్వాసం కలిగేటట్లు చెయ్యాలి. మనం చేబట్టిన విప్లవం దేశ క్షేమానికే గాని మారణ హోమానికీ, రక్తపాతానికీ కాదని ఋజువు చేయాలని చంద్రశేఖర ఆజాద్ పేర్కొన్నాడు. అంతేకాదు ప్రతి ఓటమిని ఒక పవాలుగా స్వీకరించి, అందులోని లోపాలను సరిదిద్దుకొని, నవోత్సాహంతో, కొదమ సింహాలలా కార్యరంగంలోనికి దుప్పించి దూకాలని మిత్రులకు హితవు చెప్పాడు. ఆజాద్ 'స్కాట్' ను హతమార్చడానికి పథకాన్ని వివరించాడు. " ఈ పనికి ఒకరి శక్తి సరిపోదు. కనీసం ముగ్గురైనా ఉండాలి. పోలీసులకు దొరికిపోయే పరిస్థితి ఏర్పడరాదు. హత్యానంతరం పోలీసులు వెంబడిపడితే వాళ్ళని ఎదిర్చి పోరాడాలి. ఒక్క దెబ్బతో 'స్కాట్' మరణించాలి. వాడు గాయపడి ఆసుపత్రిలో ప్రాణాలు వదలడం నాకు సుతరాము ఇష్టంలేదు. " అని ఆజాద్ హెచ్చరించాడు " ఈ హత్య చేసింది ఎవరో దుండగులు కారని, ఇది ఆంగ్లప్రభుత్వ పైశాచిక కృత్యాల ఫలితమేనని ప్రజలు విశ్వసించాలి. " అని ఆజాద్ చెప్పి " ఇప్పుడు "స్కాట్" ను ఎవరు చంపుతారు ? " అని ప్రశ్నిస్తాడు. అక్కడ కూర్చున్న వారందరూ నేనంటే నేనంటారు. " లాలాజీ మరణం నవంబరు 17 న జరిగింది. డిశంబర్ 17 న ఆయన ప్రథమ మాసిక తిథి. ఆ రోజే మదోన్మత్త ఆంగ్ల పశువును నరికి రక్త తర్పణం చేయాలి. అప్పుడే లాలాజీ ఆత్మ సంతోషిస్తుంది " అని ఆజాద్ అనగానే 'వందేమాతరం' నినాదం మిన్నుముట్టుతుంది. డిశంబర్ 17 న పథకం ప్రకారం పోలీసుస్టేషన్ వద్ద కాపలా కాస్తారు. సాండర్స్ మోటారుసైకిల్‌పై ఎక్కి పోలీస్‌స్టేషన్‌నుంచి బయటకు వస్తుంటాడు. ఒకే పర్యాయం అన్ని వైపులనుండి " స్కాట్ " అనుకొని విప్లవ వీరులు కాలుస్తారు. స్యాండర్స్ ప్రాణాలు వదులుతాడు. ఇది చూచిన " స్కాట్ " తప్పించుకోపోతాడు. "స్యాండర్స్ హత్య లాలాజీ ఘోర హత్యకు ప్రతీకారం ! జరిగింది " అని గోడలనిండా రాస్తారు. పోలీసుల నిఘా ఎక్కువౌతుంది. విప్లవవీరులు వేషాలు మార్చి అదృశ్యమవుతారు. భగత్‌సింగ్ గడ్డం, తల వెంట్రుకలు తీసి ఫెల్ట్‌హాట్ ధరించి మాయమవుతాడు. ఆజాద్ సన్యాసివేషం వేసుకొని దండ కమండలాలను ధరించి తన రహస్య కార్యకలాపాలను జరుపుతుంటాడు. ఆజాద్ శిరస్సు తెచ్చి యిచ్చినవారికి పదివేల రూపాయలు బహుమానం యిస్తామని ప్రభుత్వం ప్రకటిస్తుంది. అయినా ప్రయోజనం ఉండదు.

## ఆల్‌ఫ్రెడ్ పార్కు

అది 1931 ఫిబ్రవరి 27 వ తేది. అలహాబాద్ పట్టణంలో ఒక ఇంట్లో ఆజాద్ స్థావరం. కాలకృత్యాలు ముగించుకొని, అమెరికాలో తయారైన 0. 32 బోర్‌గల ఆటోమ్యాటిక్ కోల్ట్ క్యాలిబర్ పిస్తోలును, దానికి సరిపడ్డ తూటాలను లాల్చీ జేబులో పెట్టుకొని, పత్రికలను చేతిలో పట్టుకుని బయటకు వస్తాడు యశపాల్, సురేంద్ర పాండేలు ఆయనతో కలిసి ఆల్‌ఫ్రెడ్ పార్కు వైపుకు నడుస్తారు. పార్కు గేటువద్దకు వెళ్ళేటప్పటికి సుఖదేవ రాజ్ కూడా సైకిలుమీద వచ్చి కలుస్తాడు. యశపాల్, సురేంద్రపాండేలు ఆజాద్ వద్ద శలవు తీసుకొని మార్కెట్టుకు వెళ్ళిపోతారు. సుఖదేవ్‌రాజ్‌తో కలిసి ఆజాద్

పార్కులోనికి వెళ్లుతాడు. ఒక నేరేడు చెట్టుక్రింద, కూర్చొని భవిష్యత్తు కార్యక్రమాన్ని చర్చిస్తూ వుంటారు. ఆజాద్ అనుచరుడే, డబ్బుకాశపడి ఆజాద్ సమాచారాన్ని పోలీసుస్టేషన్కు వెళ్లి అందిస్తాడు. ఎంతో కాలంనుంచి ఆజాద్ ఆచూకీకోసం వేచి చూస్తున్న పోలీసు అధికారులు నాలుగు వ్యానులలో బందోబస్తుతో బయలు దేరి ఆ పార్కును ముట్టడిస్తారు. పోలీసు అధికారి "నాట్ బావర్" కూర్చున్నకారు ఆల్ఫ్రెడ్ పార్కులోనికి దూసుకొని ప్రవేశిస్తుంది. అజాద్‌ను చూచిన వెంటనే అధికారి రివాల్వర్‌తో కాలుస్తాడు. ఆ గుండు ఆజాద్ కుడి తొడలో చిక్కుకుంటుంది. తొడనుండి రక్తం చిమ్ముతుంది. దెబ్బతిన్న ఆజాద్ సింహంలా గర్జిస్తూ తన జేబులో వున్న పిస్టోల్ తీసి "నాట్ బావర్" చేతికి గురిపెట్టి ట్రిగ్గర్ నొక్కుతాడు. రయ్యినపోయి ఆ గుండు కుడిచేతిలో దిగబడుతుంది. యస్. పి. బావర్ పలాయనం చిత్తగిస్తాడు. మరొక అధికారి విశ్వేశ్వరసింహ పరిగెత్తుకొని వచ్చి నీరు ప్రవహిస్తున్న కాలువలో పడుకొని కాలుస్తాడు. అది ప్రక్కనుంచి దూసుకొని పోతుంది. చెట్టుచాటున దాక్కొనివున్న డి. యస్. పి. విశ్వేశ్వర సింహకు గురి పెడుతాడు. దవడకు తగలగా కేకలు వేస్తూ పారిపోతాడు.

## ఆజాద్ ఆకాంక్ష

సుఖదేవ్‌రాజ్ పారిపోదామని సలహా యిస్తాడు ఆ వీర కిశోరం (ఆజాద్) సుతరాము అంగీకరించడు. "పిరికి పందలా ప్రాణం కోసం పారిపొమ్మని సలహా యిస్తున్నావా ! మిత్రమా ! ఈ ఆజాద్ భీరువు కాడు. ఆత్మ స్వేచ్ఛ లేని ఈ శరీరం కూలిపోతేనేం ? నేను నమ్మిన సిద్ధాంతం కోసం, ఈ దేశ స్వాతంత్ర్యం కోసం ఆఖరి క్షణంవరకూ ఈ పవిత్ర వీర భూమిమీదనే నిలబడి పోరాడుతూ ప్రాణాలయినా వదులుతాను గాని, నే నెన్నటికీ పారిపోను ఈ పాంచభౌతికశరీరం మట్టిలో మట్టియై కలిసిపోవాలి. అప్పుడే నాకు మనశ్శాంతి ప్రాణాలంటావా ! స్వేచ్ఛా వాయువులను పీల్చలేని ఈ శరీరం కూలిపోతేనేం. సుఖదేవరాజ్ ! ఈ అశాశ్వతమైన ప్రపంచంలో ప్రతిదీ, ఏదో ఒక రోజున నశిస్తుంది, మాయమవుతుంది, కాలగర్భంలో కలిసిపోతుంది. అయితే నేనలా చరిత్ర హీనుణ్ణి కావాలని కోరుకోవడం లేదు. ఈ అశాశ్వతమైన భౌతిక శరీరాన్ని రక్షించుకొనేందుకు, శాశ్వతమైన అపఖ్యాతి తెచ్చిపెట్టే పని చేయమంటావా ? మిత్రమా ! అది ఈ జన్మలో జరగదు. ఒక పవిత్రమైన ఆశయం కోసం, ఒక మహోత్కృష్టమైన ఆదర్శం కోసం, అవసరమైతే మరణించడంలో నున్న ఆనందం, సంతృప్తి, అనుభూతి ఇంకెందులో ఉంటుంది ? జాతిని జాగృతం చేయడానికి ఎంతైనా త్యాగం చేస్తాను అవసరమైతే మరణిస్తాను. భావితరాలవారికి స్ఫూర్తిని, శక్తిని, ధైర్యాన్ని యివ్వడానికోసం నా సర్వస్వాన్ని భారతమాత పాద పద్మములకుసమర్పిస్తాను. భారతదేశం సజీవమవుతుంది. శతాబ్దాల పరిపాలన పీడన నుండి విముక్తి చెందుతుంది. భరతమాత సంకెళ్లు పటాపంచలు చేయబడుతాయి. ఇదే నా ఆకాంక్ష, నా తుది కోరిక " అని ఆజాద్ స్పష్టం చేస్తాడు.

## ఆజాద్ ఆవేదన

ఆవేశంతో "నాసచివుడు, నా బహిఃప్రాణము, విప్లవోషస్సు అయిన భగత్‌సింగ్‌కు, రాజగురు, సుఖదేవ్‌లకు మరణశిక్ష విధించింది ఈ కిరాతక, పైశాచిక ఆంగ్ల ప్రభుత్వం. వారిని విడుదల చేయించడానికి ఎన్నో ప్రయత్నాలు చేశాను. గాంధీగారివద్దకు సుశీలాదీదీని, దుర్గాభీభీని పంపించాను. నేనుగా పండిత నెహ్రూగారి వద్దకు వెళ్లాను, అర్థించాను. ప్రయోజనం లేకపోయింది. ఆ నాయకులిద్దరూ ఒక్కమాట అంటే మరణ శిక్ష రద్దయ్యేది. వారికి ఆ బుద్ధి పుట్టలేదు. నేనూ భగవతీ చరణ్, యశపాల్‌లు కలిసి లాహోర్ జైలుమీద దాడి చేసి భగత్‌సింగ్ ప్రభృతులను విడిపించాలని ప్రయత్నించాం. కానీ ఆదిలోనే దురదృష్టం ఎదురైంది. బాంబును పరీక్షిస్తుండగా, అది పేలి రావీనదీ తీరపు అడవులలో భగవతీచరణ్ మరణించారు. 'ఆ కసితో

పంజాబులో అనేకమంది పోలీసు అధికారులను హతమార్చాను. పర్యవసానం నా మీద ఉచ్చు మరింత బిగిసింది." అని ఆజాద్ తన ఆవేదనను వెలిబుచ్చుతుండగానే పోలీసుల విజిల్స్ వినిపిస్తాయి. "మిష్టర్ చంద్రశేఖర ఆజాద్ ! సరండర్ !" పోలీసులు మైకులో హెచ్చరిస్తారు.

## ఆజాద్ స్వైరవిహారం

ఆజాద్ గాలిలోనికి పిస్తోలు పేలుస్తూ "ఒరేయ్ బ్రిటీష్ కుక్కల్లారా ! ఈ ఆజాద్‌ను పట్టుకోవడం మీ తరం కాదు ధైర్యం ఉంటే ముందుకు రాండి ! అందరినీ యమ సదనానికి పంపిస్తాను" అని గర్జిస్తాడు. 'Fire' అన్న మాటలు వినిపిస్తాయి. ఆజాద్ గురిచూచి అన్ని వైపులా కాలుస్తుంటాడు. ఇంతలో ఒక గుండు వచ్చి ఆజాద్ కుడి భుజం నుండి దూసుకొని పోతుంది. జారిపోయే పిస్తోలును ఎడమ చేతితో అందుకుంటాడు "నీచుల్లారా ! నా మరణం మీ చేతుల్లో లేదు. నన్ను ప్రాణాలతో బంధించడం మీ తరంకాదు. నా ఒక్కని మరణంతో ఈ మహోద్యమం చల్లారదు. నా శరీరం నుండి రాలే ఒక్కొక్క రక్తపు బిందువునుండి ఒక్కొక్క మహావీరుడు ఉద్భవిస్తాడురా ! ఆంగ్ల దొరలను ప్రపంచ పొలిమేరలకు తరిమి, తరిమి కొడుతారురా!" అని ఆజాద్ సింహగర్జన చేస్తూ, పిస్తోలు గుండ్లను వదలుతూ స్వైరవిహారం చేస్తాడు. హాహాకారాలు వినిపిస్తుంటాయి. ఎంతోమంది పోలీసులు నేల కొరుగుతుంటారు. ఆ క్షణంలో ఒక గుండు వచ్చి ఆజాద్ డొక్కలో నుంచి దూసుకొని పోతుంది. ఆ వీర కిశోరం నేల కొరుగుతుంది.

## వీరమరణం

తన సర్వ శక్తిని కూడగట్టుకొని మరల లేస్తాడు. అడుగులు తడబడుతూ ఉంటాయి. రక్తం శరీరంనుండి దారలా కారిపోతూ వుంటుంది. నయనాల నుండి కన్నీరు ప్రవహిస్తూ వుంటుంది. తడబడుతున్న మాటలు నోటి వెంబడి వినవడుతూ ఉంటాయి. "నా దేశానికి స్వాతంత్ర్యం వచ్చి తీరుతుంది. ఓ భారతవీరులారా అప్పుడే విశ్రమించకండి ! విప్లవోద్యమాన్ని చల్లారనివ్వకండి." అని గొణుగుతాడు. ఒక చంప కన్నీరు మరొక చంప రక్తం. క్రింద పడుతూ లేస్తూ "అమ్మా ! భరతమాతా! నీ దాస్య శృంఖలాను త్రెంచకుండానే నీ బిడ్డ వెళ్ళిపోతున్నాడమ్మా ! నాకా యోగ్యత లేదమ్మా ! క్షమించవూ !" అంటూ విలపిస్తూ "వందేమాతరం" అంటూ పిస్తోలును కణతకు గురి పెట్టుకొని ప్రేల్చుకుంటాడు. కుప్పగా కూలిపోతాడు. అంతే

ఒరిగిపోయె, కూలిపోయె, ధాత్రిలో కలసిపోయె, వీరవిప్లవశేఖరం — చంద్రశేఖర ఆజాద్.

వందేమాతరం !



---

## కృతజ్ఞతలు

ఫిబ్రవరి సంచికలో నేను చేసిన విజ్ఞప్తికి మరియు వ్యక్తిగతంగా వ్రాసిన లేఖలకు అనేకమంది చందాదారులు స్పందించి, సహృదయంతో చందాలను పంపినందుకు కృతజ్ఞతాభినందనలు ఓగతావారు కూడా అశ్రద్ధచేయక సహకారం వెంటనే అందిసారని ఆశిస్తున్నాను. కేవలం అశ్రద్ధవల్లనే చందాలు సకాలంలో పంపలేకపోయినామని M.O. కూపన్లలో లేఖలలో తెలియపరిచారు. ధన్యవాదములు. శ్రీవాణి అభిమానులందరూ సహృదయంతో ఆలోచించి నప్పుడే నాలుగు కాలాలపాటు ఒక మంచి పత్రికగా అందించగలుగుతాను. వారంతట వారే నాలుగు సంవత్సరాల చందాలు, జీవితసభ్యులుగా చేరి సహకారం అందిస్తున్నందుకు ప్రత్యేకంగా అభినందనలు. 1, 2, 4 సం. చందా (రు. 36/-, రు. 66/- రు. 116/-)లు D. D. ద్వారాగాని, M. O ద్వారా గాని పంపి సహకరించ ప్రార్థన. జీవితసభ్యత్వం (రు 500/-) మాత్రం చెక్ ద్వారా పంపినా ఫరవా లేదు చెక్‌ల మీద D. D. ల మీద " SREE VANI, MONTHLY, MACHILIPATNAM " అని వ్రాసి పంప ప్రార్థన. ధన్యవాదములు —సం.



# నిజమైన బలం గుణబలమే

" గుణము కొంచెముండి గొప్ప కులముండిన
ఫలమదేమి ? దాని బలమదేమి ?
పంట పండని భూమి పదియెకరములేల ?
కొంచెమైన చాలు మంచి భూమి "

## శ్రీసత్యసాయిబాబా

గుణముకంటే మించిన బలము కాని ధనము కాని లోకమున లేదు. ఈ నగ్న సత్యాన్ని ప్రతి ఒక్కరూ గుర్తించాలి. అనేకమంది జ్ఞానానికి మించిన బలం వేరొకటి లేదని భావిస్తున్నారు. ధనముకాని, విద్యకాని, అధికారం కాని గుణము ముందు విలువజాలవు. ఒక ఉదాహరణ చెబుతాను. రావణుడు మహా బలశాలి. గొప్ప విద్వాంసుడు శివపూజా దురంధరుడు. జనబలం, ధన బలం కలవాడు. ఇన్ని బలములు కలవాడయినప్పటికీ శ్రీరాముని చేతిలో సంహరించబడినాడు, సర్వస్వాన్ని కోల్పోయాడు. కారణం ? గుణవంతుడైన శ్రీరామునితో వైరము పెంచుకొని, రాముని హృదయాన్ని బాధించడం చేతనే తన బలమును, రాజ్యమును సర్వస్వమును కోల్పోయాడు రావణుడు.

పాండవులు పవిత్రమైన గుణములు కృష్ణునిద్వారా పోషించుకున్నారు. దుర్యోధనుడు గుణహీనుడు. సర్వ బలములు, సకల సంపదలు ఉండినప్పటికీ గుణవంతుల పైన కక్ష తీర్చుకొనే నిమిత్తమై దుర్యోధనుడు పాండవులను హింసించాడు. దీని ఫలితంగా తాను రాజ్యభ్రష్టుడు కావడమే కాకుండా మొత్తం వంశాన్నే నాశనం గావించుకున్నాడు. రాజ్యలక్ష్మి, శ్రీలక్ష్మి, విజయలక్ష్మి గుణవంతుని మాత్రమే వరిస్తాయని పై రెండు సంఘటనలు ఋజువుచేస్తున్నాయి. కనుక గుణవంతులతో పోరాడటం గాని, గుణవంతులను చూచి సహించుకోలేక పోవడంగాని, వారిని చూచి అసూయ పడటం గాని మనకే ప్రమాదం కలిగిస్తుంది గుణవంతులకు ఏమాత్రం హాని జరగదు.

" సాధు జనులను చూచి సంకుచిత బుద్ధులు
హాస్యమును గావించు చుందురంత
వారికేమి కొరత హృదయమందు
కుంజరమును చూచి కుక్కలెన్నో మొరుగు
వాని ఘనతకేమి విలువ తగ్గు "

సజ్జనులను చూచి పరిహాసం చేయడంవల్ల వారికి కలిగే నష్టం ఈషన్మాత్రం ఉండదు. మనం సంకుచిత బుద్ధులం కావడంచేత పవిత్ర హృదయాలను హాస్యాస్పదంగా భావిస్తుంటాం. ఏనుగు పోతుంటే కుక్కలెన్నో మొరుగుతుంటాయి. అంతమాత్రం చేత ఏనుగు విలువ తగ్గుతుందా ? అదే విధంగా గుణవంతులను ఎవరు విమర్శించినా, ఈసడించినా వారి ఘనతకేమీ లోటు రాదు. చివరికి నష్టపోయేది సంకుచిత బుద్ధులు గలవారే. జరాసంధుడు, కంసుడు కూడా ఈ కోవకు చెందినవారే. గుణవంతుడైన కృష్ణునిపై వైరముపూని భ్రష్టులైనారు. దురదృష్టవశాతు ఈనాడు ధనబలం, జనబలం, భుజబలములకు మాత్రమే ప్రాధాన్యతనిస్తున్నారు. ఇవన్నియు దుర్బలములు మాత్రమే. నిజమైన బలము గుణబలమే. ఈ గుణమును పోషించుకునే విషయమందు అతి జాగ్రత్తగా ఉండవలసి ఉంటుంది. మనకంటే

అధిక గుణములు కలవారితో విరోధం గావించుకోవటమో, లేక పరిహసించడమో, వారిని పరాభవం చేయటమో, వారి మనస్సును బాధించడమో – ఈ విధమైన చర్యలు మన జీవితమునకు ప్రమాదకరమైనవి. ప్రాచీనకాలం నుండి గుణవంతుని ద్వేషించి, బాధించి, పరిహసించే విషయమును అరికట్టడానికి మహర్షులు ప్రయత్నించేవారు. అయితే ఈనాటి విద్యావిధానంలో అటువంటి ప్రయత్నం లేదు. "గుణవంతులైన పెద్దలను బాధించడం సరికాదు" అని ప్రాచీనులు ఉగ్గుపాలతో పసి హృదయాలకు హత్తుకొనే విధంగా బోధించేవారు. పవిత్ర గుణములు కేవలం గ్రంథములద్వారా నేర్చుకోవడానికి వీలు కాదు. అధ్యాపకులు నిత్య జీవితంలో అనుభవిస్తూ ఉన్నత భావాలను లేత హృదయాలలో చేర్చడానికి తగిన ప్రయత్నం చేయాలి. ముదిరిపోయిన పొట్లకాయకు రాయి కట్టి ప్రయోజనం లేదు. లేత హృదయాలైన బాలబాలికల హృదయాలకు దివ్యమైన బోధనలను, పవిత్ర తత్వములను అందించాలి.

## ప్రాచీన విద్య

ప్రాచీన విద్యా విధానమును విచారిద్దాం. పూర్వం మన భారతదేశంలో 5, 6 విశ్వవిద్యాలయములు మాత్రమే ఉండేవి. మొదటిది కాశీ విశ్వవిద్యాలయం. దీనిలో ఒక్క వ్యాకరణము మాత్రమే ప్రత్యేకంగా బోధించేవారు. విద్యార్థుల యొక్క భవిష్యత్తు అధ్యాపకులకు అర్పించేవారు. వారి నిర్ణయములంతా అధ్యాపకులే చేసేటటువంటి వారు. ఏ దేవాలయ ప్రాంగణమునందో, ఏ వృక్షము ఛాయ క్రిందనో కూర్చొని నలుగురు, ఐదుగురు విద్యార్థులకు మాత్రమే Grammer బోధించేవారు. విద్యార్థుల సంఖ్య తక్కువ. విద్యాసక్తి ఎక్కువ. అధ్యాపకుని గృహమే విద్యాలయంగా ఉండేది. ఈనాడా! ఒక్కొక్క క్లాసులో వందలకొలది ఉంటున్నారు. 'మంది ఎక్కువైతే మజ్జిగ పలచన' అన్నట్లుగా విద్యార్థుల సంఖ్య పెరుగుతున్న కొద్దీ విద్యా ప్రమాణాలు తరుగుతూ వస్తున్నాయి. ఒకేఒక Subject ను తీసుకొని విద్యార్థులకు బోధించడం ప్రాచీన విద్య ప్రత్యేకత. మరొక Subject అనేది ఏమాత్రం కనిపించదు. ఒక్క విషయమునందు మాత్రమే విద్యను తరిఫీదుచేసి జగత్తునకు వ్యాప్తి గావించేవారు. ఈనాటి విద్యార్థులకు కావలసినన్ని Subjets మోయలేనన్ని Books తీసుకొనిపోతుంటారు. ఒకే Subject అయితే పిల్లలు ఏకాగ్రతను అభివృద్ధి పరచుకుంటారు. అనేకరకములైన Subjects ఏక కాలంలో బోధించుటచేత Confusion ఎక్కువైంది. ఈ స్థితి ఈనాడు అభివృద్ధి అవుతున్నది. పూర్వం కాశ్మీరు విశ్వవిద్యాలయంలో అలంకార శాస్త్రము, ఉజ్జయినీలో

## సాయి శ్రీ

తలపగా శౌరి వివిధావతారములకు
తాను భగవంతుడైనట్టి మానవులకు
నెలవు భారతదేశంబు నేలయందు
అట్టివారల నొకడు నీ యార్యగుణుడు

రామనామంబు నీ నాటి భూమికీయ
పుట్టపర్తిన బుట్టిన పుణ్యతముడు
షిర్డిబాబావతారము సిద్ధులందు
నొకడుగాకున్న కలుగునే ప్రకటమింత

అతని దర్శనంబు అంజనం బక్షికి
భాషణంబు శ్రవణ భూషణంబు
పాద సేవయన్న భవజలధికి నావ
భక్తి తతికి కొంగు బంగరు సుమి

సిద్ధుల విద్యాధరులన్
సిద్ధార్థుని వినుతెగాని – క్షితి నీ నాడున్
ఇద్ద చరిత్రుడు రెండవ
బుద్ధుండగు సాయిబాబ బుద్ధిన్ దలపన్

— కపిలవాయి లింగమూర్తి

ఖగోళశాస్త్రము, తక్షశిలలో పాణిని వ్రాసిన వ్యాకరణ శాస్త్రమూ మరియు వైద్యశాస్త్రములు ప్రత్యేక Subjects గా బోధించేవారు. ఈ విధంగా ఒక్కొక్క విశ్వవిద్యాలయంలో ఒక్కొక్క Subject ను మాత్రమే ప్రధానంగా బోధించి పిల్లలలో ప్రావీణ్యతను అభివృద్ధి పరచేవారు.

## మనుధర్మశాస్త్రం

నలజ్యోతి విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్రమును ప్రత్యేకంగా బోధించేవారు. న్యాయశాస్త్రంలో మనుధర్మ శాస్త్రం, శుకశాస్త్రమును ప్రధానంగా బోధించేవారు మను ధర్మశాస్త్రం భారతీయులకు ప్రాణసమానమైనటువంటిది. సర్వ మానవుల యందున్న సహజ తత్వాన్ని విచారించి, ఆ సహజత్వాన్ని పోషించుకుంటూ రావటమే మనుధర్మ శాస్త్రముయొక్క ప్రధాన లక్ష్యం. ప్రతి మానవునికి స్వాతంత్ర్యం ఉన్నదనే వాదన ఈ శాస్త్రంలో ఉన్నది. అయితే ఇక్కడ రెండున్నాయి. **1. Individual freedom. 2. Fundamental law.** ఈ వ్యక్తిగతమైన స్వాతంత్ర్యం కొంతవరకు మాత్రమే ప్రయాణం సలుపుతుంది Fundamental Law అనేది సామాన్యమైన తత్వాన్ని బోధిస్తుంది. మనం పుట్టటం, పెరగటం, జీవించటం, అంతమొందటం సమాజంలోనే చేరి ఉంటుంది. కాని ఈనాడు సమాజంయొక్క తత్వమును ప్రతివ్యక్తి విస్మరిస్తున్నాడు. దీనివల్ల తనకు ఏవిధమైన లాభం లభిస్తుందని యోచిస్తున్నాడు. నా కుటుంబానికి లభించే సుఖమేమిటి ? అని ఆలోచిస్తున్నాడు. “ నేను ” అనే స్థానం నుండి బయలుదేరి “కుటుంబం” అనే స్థానమునకు ప్రయాణంచేసి అక్కడ నిలచిపోతున్నాడు. ఈ కుటుంబం దేనిపైన ఆధారపడి ఉంటుందనే విషయాన్ని మాత్రం విచారించటలేదు. ఒక్క వృక్షం వనం కాదు. ఒక్క వ్యక్తి సమాజం కాదు. ఒక్క గృహం గ్రామం కాదు. అనేక గృహములు చేరినప్పుడే ఒక గ్రామం ఏర్పడుతుంది. అనేక వృక్షములు చేరినప్పుడే వనముగా రూపొందుతుంది. అనేక మంది వ్యక్తులు చేరినప్పుడే ఒక సమాజమవుతుంది. సమాజమునకు ప్రత్యేకమైన పంచభూతస్వరూపం లేదు. కనుక సమాజమే మనకు సరైన స్థానమనే సత్యాన్ని ప్రతివ్యక్తి గుర్తించాలి. సమాజ దృక్పథాన్ని నేటి విద్యావిధానంగా తీసుకోవాలి.

## కర్తవ్యం

మానవునియొక్క ఆశలకు అంతులేదు. ఆశలు మితిమీరిపోతున్నాయి. ప్రతి ఒక్కరు ఇతరులు తనను గౌరవించాలని, ప్రేమించాలని ఆశిస్తున్నారు. కాని తాను ఇతరులను గౌరవిస్తున్నాడా ? ప్రేమిస్తున్నాడా ? అనే విషయాన్ని మొట్టమొదట ఆలోచించాలి. అందరికంటే నాకు అధికంగా రావాలి అనుకుంటాడు అధికంగా రావటానికి అవకాశం, విధానం ఏమిటి ? దీనిని గురించి యోచించటంలేదు. ఎప్పుడు అందరికంటే అధికుడవుతాడంటే, మానవుడు తన వంతు కర్తవ్యాన్ని చక్కగా నిర్వర్తించినప్పుడే అందరి గౌరవానికి పాత్రుడవుతాడు. అప్పుడే సమాజం అతనిని గౌరవిస్తుంది. ఎవరి కర్తవ్యాన్ని వారు నిర్వర్తించాలి. అయితే ఈనాడు మరొకరి కర్తవ్యంలో తాను భాగం వహిస్తున్నాడు గాని, తన కర్తవ్యాన్ని మాత్రం విస్మరిస్తున్నాడు. తన విషయం వదలి పరుల విషయంలో జోక్యం చేసుకుంటున్నాడు. ఎన్నివిధములైన లౌకిక విద్యలున్నప్పటికి కర్తవ్యం ఈ విద్యలతో ఏర్పడేది కాదు. నిత్య జీవితంలో సంబంధ బాంధవ్యాలను గుర్తుంచుకున్నప్పుడే ఈ కర్తవ్యం గుర్తించటానికి వీలవుతుంది. తల్లిదండ్రులు తమ వంతు కర్తవ్యాన్ని చక్కగా నిర్వర్తించాలి. ఆదర్శప్రాయమైన జీవితాన్ని గడుపుతూ పిల్లలకు చక్కటి బుద్ధులను గరపాలి. అదేవిధంగా గురువులు తమ నడతను అభివృద్ధి గావించుకొని, నైతిక విలువలను పెంపొందించుకొని విద్యార్థులకు ఆదర్శప్రాయంగా మెలగాలి. విద్యార్థులు తమ కర్తవ్యాలను గుర్తెరిగి వినయవిధేయతలతో ప్రవర్తిస్తూ అటు కన్నవారికీ, ఇటు గురువులకు సంతృప్తి పరచే విధంగా ప్రవర్తించాలి. అదే ‘ కర్తవ్యము ’ అంటారు.

( తరువాయి 45వ పేజీలో )

మినీ కథ

# కొందరు కొడుకులు

— కావలిపాటి విజయలక్ష్మి

'లక్ష్మీ! లక్ష్మీ' బిగ్గరగా పిలుస్తూ వీధిగేటు తోసుకుని, 'బాబేడుస్తున్నాడు. ఏం చేస్తున్నావ్! వెధవ చాకిరీ, వెధవ చాకిరీ' అన్నాడు కాంతారావు.

వెధవ చాకిరీ అన్నమాట చెవిని పడగానె, అతని తల్లి సత్యవతమ్మ 'చాకిరీలేమీ చేయించటంలేదురా, ష్టౌ బర్నరు చూడమంటేనూ!'

'ష్టౌ బర్నర్లు చూడటం దానికేం తెలియదు. ఆ ష్టౌ వాడిదగ్గరకెళ్ళి బాగుచేయించుకో' అన్నాడు తల్లి మాట పూర్తికాకుండానె కాంతారావు.

గడపలో కూర్చున్న సత్యవతమ్మకి అతని మాటలు గుండెల్లో గుచ్చుకున్నాయి. వెధవచాకిరీలు చేసే రోగిష్టిదాన్నయిపోయానురా! అంది రోషం. దుఃఖం గొంతు పూడిపోయింది సత్యవతమ్మకు.

అలా అంటె ఎలా బాబూ! అని పొరిగింటావిడ ఏదో హితవు చెప్పబోతే ఆమె మీద విరుచుకుపడ్డాడు కాంతారావు

'మీరేంచెప్పనక్ఖర్లేదు వ్యవస్థ మారిపోయింది. చెయ్యరు. చెయ్యం ఇది త్రేతాయుగం కాదు' అంటూ

బాగుంది బాబూ! బాగుంది. పిల్లల్నెందుకు పెంచుకుంటాం. ఆమె నీకు చాకిరీ చెయ్యలేదా! అతను డబ్బు పెట్టలేదా అందావిడ

నేనూ చేశాను ఆ ఇంటికి చాకిరీ. గుడ్డు పెట్టాడు. గులక పెట్టాడు. ఎందరో తల్లి తండ్రిని చూడటం లేదు ఏం చేస్తారేం! అన్నాడు.

ఇహ అతని మాటలు వినలేని సత్యవతమ్మ అక్కడ నుంచి లేచి వెళ్ళి పెరటి గడపలో చతికిలబడింది.

కొడుకు గొంతు వినగానే కోడలు వెళ్ళిపోయింది. ఏం చాకిరీ చేయించుకుంది? పూర్తిగా అస్వస్థురాలయి పోతేనే కోడల్ని పిలుస్తుంది. మరెవర్ని పిలుస్తుంది. కని, పెంచి డబ్బు దస్కం పెట్టి వాళ్ళు కోరుకున్న వేరు కాపరం పెట్టి అన్నీ చేసి వాళ్ళచేత చేయించు కోవాలి కాని మనకి చెబుతుందేమిటని అని పోతారని ఎవరికీ చెప్పదు. కోడలు తనింట్లో వండే కూర తెచ్చి ఇంట్లో పెట్టేంతలో ఇంత రబస కావాలనే అన్నాడు. వీడి నెలా పెంచింది? తను, ఇంకేపిల్లలున్నారని వాదించినా, భర్త చిత్తుకాగితాల్లా డబ్బు విర జిమ్మి వ్యాపారం పెట్టిస్తే వాడికి కళ్ళు నెత్తికొచ్చాయా. తానూ అతనూ ఖాతరు లేకుండా పోయారా?

వ్యవస్థ మారిందా? ఓ నిర్వేదమైన నవ్వు పెదవులపై కదిలింది. ఆ క్రింది పెదవిపై కన్నీటి బొట్టు జారింది సత్యవతమ్మకు.

సినిమాలు సూసి, కతలు సదివి చాలామంది కుఱ్ఱోళ్ళు లాగె తయారవుతున్నారమ్మ. పని మనిషి అప్పలమ్మ తాను కంట తడి పెట్టినప్పుడన్నమాట గుర్తొచ్చి మరో నవ్వు కదిలిందామె పెదవుల మీద.

వ్యవస్థ మారుతుందా? ఎటు? భారతీయ సంస్కృతి పురోగతికా అదోగతికా. 'రాముడు ఏలిన రాజ్యం' వాడి పెళ్ళయిన నాలుగు సంవత్సరాల్లో వాడన్న మాటలు ఒక్కొక్కటీ గుర్తొచ్చి, నీర్సం వచ్చింది సత్యవతమ్మకు. కొడుకు కాదు. కురుపు అనుకుంది. ★

# కుం  కథ

గాంధారి మాటల్ని వింటూన్న కుంతికి తన బిడ్డ కర్ణుడు జ్ఞప్తికి వచ్చాడు. ఆమె ముఖం వాడిన పద్మంలా చిన్నబోయింది. ఆమె మనసున గల ఆరాటాన్ని ఆ తపోధనుడు వ్యాసుడు గుర్తించాడు. ఆమె పట్ల జాలిగలిగి, ఆమెతో, "నీ మనసున గల కోర్కెను చెప్పవమ్మా! నీవు పవిత్ర చరిత్రవు, సందేహించకు" అన్నాడు.

ఆ మాటకు కుంతి సంతోషించింది. ధైర్యం తెచ్చుకున్నది. వ్యాస భగవానునికి నమస్కారం చేసింది. చేతులు మోడ్చింది. మనసునంతా లజ్జ ఆక్రమించగా, వినయంతో ఆమె తన కథ నిలా చెప్పింది.

వడలి మందేశ్వరరావు

"దేవతలకే నీవు దేవతవు: ఇట్టి నిన్ను మామగా పొందగల్గాను కరుణతో నా విన్నపాన్ని ఆలకించు.

"అప్పుడు నేను కన్యాత్వ దశ యందున్నాను. మా జనకుని దగ్గరకు మహాకోపి అయిన దుర్వాసుడనే మహాముని వచ్చాడు. అతనిని ఎంతో వినయంతో సేవించాను. ఆయనా ఎంతో సంతోషించాడు. ప్రీతి నొంది, ఆయన, 'ఓ పసిదానా! నీకు ఒక వరాన్ని ఇస్తాను నీ ఇష్టమైన దానిని కోరుకో!' అన్నాడు. 'మీరు ప్రీతి నొందడం కంటె నాకు వేరే కోర్కె అనేది లేనే లేదు. మహాత్మా!' అని అన్నానే కాని, నే నేమీ కోరనే లేదు.

"కాని ఆ మహామునిని చూస్తే నా మాట అయనకు వచ్చినట్టు లేదు. ఆ తాపసి 'వరాన్ని ఎలాగయినా ఇవ్వక పోను, 'అడుగు!' అన్నాడు.

"ఆయన కోపికదా, నేను భయ పడ్డాను. మనసున నున్నది కదా, అని నాకు పుత్రుడు కల్గేటట్టు వరమును ప్రసాదించ మన్నాను. ఆయన నాకొక మంత్రాన్ని ఉపదేశించాడు. 'నీవు ఏ దేవతల నైతే ఉద్దేశించి, ఈ మంత్రాన్ని జపిస్తావో, ఆ దేవతలు నీకు వశులై సుత జన్మాన్ని కల్గిస్తారు. విశేషించి నీవు ధర్మపునకు తల్లివి కాగలవు!' అని ఆయన అంతర్ధాన మయాడు.

"ఆయన మాటలకు నేను ఆశ్చర్యపోయాను. అద్భుత పడ్డాను. ఆ మంత్రాన్నే తిరిగి తిరిగి మనసులో తలచుకొంటూండే దాన్ని. ఒకనాడు వేకువన మంచి ఉత్సాహంగా మేడ మీద నిలబడి ఉన్నాను. ఉదయిస్తూన్న కమల మిత్రుడు కంటబడ్డాడు. నేను కన్యను, ఇది దోషమని బాల నవడం వల్ల, అజ్ఞానం వల్ల, నాకు స్ఫురించనే లేదు. ముని ఇచ్చిన మంత్రమున్నది, అటు ఎదురుగా సూర్యదేవు డున్నాడు, అవి మంత్రబలాన సూర్యుని ఆవహించాను.

"తత్ క్షణంలో అటు అకసంలో లోకాల కోసం ఆయన ఆత్మమూర్తి వెలుగుతూండగా, 'మూర్త్యంతరంబు దాల్చి' దివాకరుడు నా ఎదుట ప్రత్యక్షమైనాడు.

"నా ఆశ్చర్యానికి మేర లేక పోయింది. వడ వడ వణకి పోయాను. 'వర మిస్తాను, అడుగు!' అంటూన్న సూర్యునికి చేతులు జోడించి, 'అయ్యయ్యో! సూర్యదేవా! అనుగ్రహించండి-వెళ్ళిపోండి! ఇలా ఎందుకు విచ్చేశారు?' అన్నాను. ఆయన ఇలా అన్నాడు: 'మంత్ర శక్తి ఉన్నది కదా అని వృధా హ్వానమొనరించడం అపరాధం. నీవూ నీకీ మంత్రాన్ని ఉపదేశించిన వాడూ కూడా శాపోపహతులై పోతారు!'.

"నేను భయపడ్డాను; నా మూలాన నిరపరాధుడైన గురువును—శాపనిహతునిగా చేయనోర్వ లేక పోయాను' "ఓ దేవా! నాయందు కృపను వహించి. నీతో సరియగు తేజస్వి అయిన పుత్రుని ప్రసాదించ" మన్నాను.

ఆయన అపరిమేయ తేజుడు. తన తేజము వల్ల నా చూపును, మొగమును, ఇంద్రియాలను సమ్మోహితం చేశాడు 'నీకు తనయుడు కలుగుతాడు; నీకు కన్యాత్వం వికలం కాకుండా ఉండేటట్టు వరాన్ని కూడా ఇస్తున్నాను' అని మళ్ళీ దివమునకు వెళ్ళిపోయాడు.

"నేను ఎలాగో తండ్రినీ, బంధులనూ, వంచించి గూఢ మందిరాంతరంలో కొడుకును కన్నాను."

అత డెట్టి కొడుకు అని ! కుంతి వ్యాస భగవానునితో వాయివిడిచి చెప్పలేదు కాని, నన్నయ్య గారు ఆ కొడుకు స్వరూపాన్ని చూపారు;

"సలలితమైన పుట్టుఁ గవచంబు విసర్గజమైన కుండలం
బుల యుగళంబు నొప్పఁగ సుపుత్త్రుఁడు కర్ణుడు
పుట్టె సూర్యమం
డల మొకొ భూతలంబున బెడంగయి దీప్తి కర
సహస్రకంబుతో
వెలిఁగెడు నా నిజద్యుతి సవిస్తర లీల వెలుంగు
చుండగన్
— ఆది : 5-24

కుంతి ఇంకా ఇలా అంది :

"ఆ కొడుకును కని, ఆ పసివాణ్ణి ఏటిలో వదలి పెట్టాను ఇదంతా కలలా ఉండేది నాకు. దివ్య బోధ గల మహాత్ములు మీరు ! మీకిది దృష్టి గోచరమయే ఉంటుంది ; ఇదంతా నా మనసును కాల్చివేస్తూనే ఉంటుంది.

"ఆ పని పాప మవునో, కాదో, దానిని తలచుకుంచే ఇప్పటికీ వణకి పోతూంటాను. నా భయాన్ని తీర్చగల మహాత్ములు మీరే ! ఈ కరువృద్ధు అభిమతాన్ని ఈడేర్చండి. ఈజన్మకు నేను ఇంతకన్న కోరుకొనే దేమీ లేదు మహాత్మా!"

కర్ణుని జన్మరహస్యం కుంతికి తెలుసు, కర్ణునికీ తెలుసు అది కర్ణునికి మరీ బాధాకరమైన విషయం. ఆతడు యుద్ధంలో తనతో రక్తంపంచుకొని పుట్టిన వాళ్ళను చంపవలసి ఉన్నదన్న ఆవేదన ఒక పైపున ఉండగా, తన కెదురుగా కనబడే తల్లిని 'అమ్మా!' అని ఒక్కసారైనా తాను పిల్వ వీలులేదు. తన చుట్టూ ఉన్న సోదరులకూ, తండ్రులకూ, తాతలకూ, అందరికీ తానుపెరవాడే!

తొలిసారిగా కుమారాస్త్ర విద్యా ప్రదర్శన సందర్భాన తాను అర్జునునితో తలపడి విలువిద్యను ప్రదర్శించి నప్పుడు, ఆతనిని 'సూతకుల సంభవు' డని భీముడు అవహస్యం చేయగా, ఎదురుగా తల్లి ఉన్నా, దిక్కులేని వానిలా ఏమనాలో తోచకుండా ఉండిపోయాడు కర్ణుడు! 'దీర్ఘోష్ణ నిశ్శ్వాస వ్యాకులిత వదనుండయి యాకాశంబున నున్న యాదిత్యుం జూచుచు మిన్నకుండె!'

ఆతని జన్మరహస్యాన్ని శ్రీకృష్ణుడాతనికి చెప్పినా, తమ్ముని మేలుకోరే, ఆతడు పాండవులలో చేరిపోలేదు!

ఆతడు శ్రీకృష్ణునితో ఏ మన్నాడో చూడండి :

"ధర్మతనయుండు తాను తమ్ముఁడగుట
యెఱిఁగె నేనియు సామ్రాజ్యమేల పూను ?
నట్టి ధార్మికుఁ డాధిపత్యంబుఁ జేయ
వలవదే శాశ్వతంబుగ వసుధఁ కెల్ల!"
—ఉద్యో : 4-44.

అటు సుయోధనునికి ఓపినంత సేవాభావాన్ని నిర్వహిస్తూ, ఇటు తమ్మునికీ మేలుకోరుతూ, యుద్ధంలో నేల కొరిగి పోయాడు కర్ణుడు!

అంతటి కొడుకుని కని, ఆతడు కొడుకని ఇన్నాళ్లూ చెప్పుకోవడానికి నోచుకోని కుంతి ఎంత అనుభవించి ఉంటుంది! ఆమెకు ఎంతగా ప్రేమ మీర కొడుకును చూడాలని ఉంటుంది! అందుకే ఆమెకు ఈ జీవితానికి పరమార్థం కన్నకొడుకును కొడుకుగా చూడడమనిపించి ఉంటుంది. అందుకే ఆమె వ్యాస భగవానుని కట్టి విన్నపాన్ని చేసింది !

[ సశేషం ]

# జర్నలిజంలో ఘనాపాఠి శ్రీ తుర్లపాటి

ఆయన నిగర్వి.
ఉపన్యాస కేసరి.
వ్యాసవిద్యా విశారద.
నిష్పక్షపాత హృదయులు.
రాజకీయ పండితుడు.

ఆయనెవరో కాదు–జర్నలిస్టులలో ఘనాపాఠి అనిపించుకున్న తుర్లపాటి కుటుంబరావుగారే ఆయన.

సంయమనం, దాంతోపాటు ఒకింత నిష్కర్ష, మరికొంత విశ్లేషణా సామర్థ్యం, పూర్వాపరాలను బేరీజు వేయగల శక్తి, ప్రవృత్తిపట్ల ఆసక్తి–ఇవన్నీ ఉన్న వ్యక్తి తుర్లపాటి అనటం వాస్తవమే అవుతుంది.

**ద్వా. నా. శాస్త్రి**

అది 1947. దేశంలో స్వాతంత్ర్య పవనాలు తొలిసారిగా ప్రసరించిన సంవత్సరం అది. అప్పుడే జర్నలిజ ప్రపంచంలో అడుగుపెట్టారు శ్రీ తుర్లపాటి. అప్పటి నుంచి ఇప్పటిదాకా ఎత్తిన కలం దించకుండా–వెనుకడుగు వెయ్యకుండా – ఘరింతగా రాటు తేలుతూ "కత్తి కంటె పదునైనది కలం" అని నిరూపిస్తున్న ప్రతిభావంతులు శ్రీ తుర్లపాటి.

1951 లో ఆచార్యరంగా ఆధ్వర్యాన వెలువడిన 'వాహిని' వారపత్రికలో ఉపసంపాదకత్వం కొన్నాళ్ళు, 52–53 అలో 'ప్రతిభ' వారపత్రికకు సంపాదకత్వం కొన్నాళ్ళు- "ప్రజాపత్రిక" లో న్యూస్ ఎడిటర్‌గా మరి కొన్నాళ్ళు- "ప్రజాసేవ" కి సంపాదకత్వం ఇంకొన్నాళ్ళు పనిచేసి 1960 నుంచి "ఆంధ్రజ్యోతి", "జ్యోతిచిత్ర" లలో సహాయ సంపాదకులుగా, సంపాదకులుగా వృత్తిని కొనసాగిస్తున్నారు శ్రీ తుర్లపాటి.

ఆయన ఆంధ్రరాష్ట్ర ఉద్యమంలోనూ, విశాలాంధ్ర ఉద్యమంలోనూ తీవ్రంగా పనిచేశారు.

శ్రీ తుర్లపాటి కలానికి వాడి, వేడి ఎక్కువ. ఈ తరం వారికి మన పూర్వనాయకుల, మహామహులను గురించి తెలియజెప్పాలనే తపనతో దాదాపు రెండువేల మంది రాష్ట్ర, జాతీయ ప్రముఖుల జీవిత సంగ్రహ చరిత్రలను రచించారు. "జాతినిర్మాతలు", "వార్తలలోని వ్యక్తులు," "మహానాయకులు", "విప్లవనాయకులు" అనే గ్రంథాలు తరతరాల భారతదీప్తిని ప్రకాశింపజేస్తుంటాయి. యువతరంలో దేశభక్తిని, కర్తవ్యదీక్షని రగుల్కొల్పే ఈ పుస్తకాలు ముఖ్యంగా ఈనాడు ఎంతో అవసరం. "ఆంధ్రకేసరి", "వీర కాకాని", "ప్రజలమనిషి" అనేవి కూడా తుర్లపాటివారి వ్యక్తిత్వాన్ని తెలిపే రచనలు. "ప్రసిద్ధ పురుషులు", "స్వాతంత్రయోధులు", "ప్రఖ్యాత మహిళలు" అనే అముద్రిత రచనలు ఇంకా వెలుగు చూడవలసి ఉన్నాయి. మరో విశేషం ఏమిటంటే తుర్లపాటివారు ఉత్తమ అనువాదకులు కూడా.

"జాతీయ ఫిలిం అవార్డ్సు కమిటీ" లోను, "చిల్డ్రిన్స్ ఫిలిం కమిటీ" లోనూ, "అధికార భాషా సంఘం" లోను, "ఫిలింప్రెస్ క్లబ్" లోను, "వర్కింగ్ జర్నలిస్టుల క్లబ్" లోనూ తుర్లపాటివారు "నా భొందో" అంటూ అహర్నిశలు శ్రమించారు. "కళాసరస్వతి", "ఉపన్యాస కేసరి" వంటి బిరుదులెన్నో అయాచితంగా లభించాయి. 1982 లో ఉత్తమ జర్నలిస్టుగా రాజ్యలక్ష్మి అవార్డు వరించింది. 1985 లో డాక్టర్ శంకర్‌దయాళ్‌శర్మగారు "దాసరి ఉత్తమ జర్నలిస్టు స్వర్ణపతకం" బహూకరించారు. 1985 లోనే నలభై సంవత్సరాల జర్నలిస్టు జీవితం పూర్తయిన

సందర్భంగా శ్రీ కోన ప్రభాకరరావుగారి ఆధ్వర్యంలో అక్కినేని నాగేశ్వరరావుగారు అభినందించారు. "ఉపన్యాస సమ్రాట్" అని కీర్తించారు. మైసూర్‌లో శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ సత్కరించటం తుర్లపాటి జీవితంలో మరపురాని ఘట్టం.

రాజాజీచేత "గార్డియన్ ఆఫ్ తెలుగు" అనిపించుకున్నా, "యువతరానికి మార్గదర్శకుడు" అని నీలం సంజీవరెడ్డి చేత పొగడ్త పొందినా, గొట్టిపాటి బ్రహ్మయ్య "ఆధునిక జీవిత చరిత్రకారులలో అగ్రగణ్యుడు" అని ప్రశంసించినా, తుర్లపాటి కుటుంబరావు గారిలో 'అహం' ఏమాత్రమూ కనపడదు. "తెలుసుకోవల్సింది ఎంతో వుంది" అని అంటూ వుంటారు. "చేయవల్సింది చాలా వుంది" అని అవేదన పడుతూ వుంటారు. పిన్నలను కూడా సాదరంగా పలకరిస్తారు-ప్రోత్సహిస్తారు. "పత్రికలు - సినిమాలు - సభలు" ఈ మూడూ తుర్లపాటి జీవిత నిఘంటువులో ప్రసిద్ధపదాలు - అవి నిత్య చైతన్యవంతమైనవి- రంగు రుచి వాసన గలవి ! ! ★



# స్వీకారం

"బ్రహ్మవాక్కు" (సాంఘిక నవల)
వెల రు. 5-00
రచన : కాజ వెంకటపద్మనాభరావు
ప్రతులకు : కృష్ణవేణి ప్రచురణలు
రామచంద్రరావురోడ్, విజయవాడ
520 002

"దేవీ ప్రార్థనలు" (శ్రీచక్రయంత్రసహితము)
వెల రు. 3-00
అనువాదకుడు : పురాణపండ రాధాకృష్ణమూర్తి
ప్రతులకు : పురాణపండ రాధాకృష్ణమూర్తి
రాజమండ్రి - 4

"ఆయుర్వేద చికిత్స" వెల రు. 18-00
రచన : డా॥ చిన్మయ
ప్రతులకు : పల్లవి పబ్లికేషన్స్
ఏలూరు రోడ్, విజయవాడ — 2

"శ్రీ రామానందలహరి" వెల రు. 3-00
"చాణక్య" వెల రు. 1-00
"శ్రీరామ గీతాసారము" వెల రు. 3-00
రచయిత : శ్రీ కోడూరి శ్రీరామకవి
ప్రతులకు : శ్రీ కోడూరి శ్రీరామకవి
11/144, గాంధీవిగ్రహం సందు, గుడివాడ-521 301

"ధర్మాచరణ" వెల రు. 6-00
గ్రంథకర్త : శ్రీ చిన్నకోట మాధవరావు
ప్రతులకు : శ్రీ కోడూరి శ్రీరామకవి
11/144, గుడివాడ 521301

"శ్రీ సత్యసాయి పద్యసూక్తులు" వెల రు. 2-00
సంకలనం : శ్రీ బి. రామరాజు
ప్రతులకు : శ్రీ మాదిరాజు వెంకటేశ్వరరావు
నాగార్జున ప్రింటింగ్ వర్క్స్
హైదరాబాద్, 500 020

"చైతన్య కవిత" వార్షిక సభ్యత్వం రు. 10-00
ప్రతులకు : డా॥ టి. వి. సుబ్బారావు
జ్ఞానభారతి, బెంగుళూరు యూనివర్‌సిటీ కాంపస్
బెంగుళూరు - 560 056 ★



# ఎం. ఎన్. రాయ్ ప్రతిపాదించిన మానవవాద లక్ష్యం

సృష్ట్యాదినుంచీ మానవ జీవితం వివిధ దశలుగా పరిణామం చెందుతూ వుంది. అతని జీవిత విధానం ఆలోచనా పద్ధతీ, భావాలు అనేక రూపాలుగా మార్పు చెందుతూనే వున్నాయి.

అనాది మానవుని జీవితాన్ని పరిశీలిస్తే కేవలం మనుగడ కోసమే ఆనాటి మానవుడు తన జీవన పోరాటాన్ని కొనసాగించాడు. ఆ పోరాటంలో ఆహార సముపార్జన ఒక్కటే ధ్యేయంగా జీవించాడు. ఆ తర్వాత మానవుడు నాగరికాభిముఖంగా ముందడుగు వేస్తున్న కొలదీ జీవితంయొక్క విలువను గ్రహించి తన జీవితాన్ని ఆనందమయంగా, నిరపాయంగా గడపటం కోసం ఆనాటి నుంచీ ఈనాటి వరకు అనేక మార్గాలను అన్వేషిస్తూ తన పురోగమనాన్ని కొనసాగిస్తున్నాడు.

యస్. యస్. ల

జీవన పోరాటంలో ప్రకృతి సంపదను తన ఆధీనంలోకి తెచ్చుకొనే నిమిత్తం తన తోటివారి సహాయ సహకారాలను ఆశించి సమాజాన్ని ఏర్పర్చుకున్నాడు. ఆ క్రమంలో ఆవిర్భవించిన సమాజం ద్వారా తన శ్రేయస్సును, సుఖ శాంతులను ఆశించి సామాజికంగా అనేక కట్టుబాట్లను, నీతి నియమాలను విధించుకొని వాటి కనుగుణంగా తన జీవన గమనాన్ని కొనసాగిస్తున్నాడు. ఇక్కడే మానవ జీవితం ఒక అనూహ్యమైన మలుపు తిరిగినట్లుగా చెప్పవచ్చు. ఈ పరిణామంలో సాంఘిక జీవనానికి ముందున్న తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కోల్పోయి సామాజిక సంకెళ్ళకు బందీయై నేటికీ వాటి నుంచి విముక్తికోసం పోరాడుతూనే వున్నాడు.

ఆ తరువాత కాలక్రమంలో ఆవిర్భవించిన అనేక మత సిద్ధాంతాలు, సాంప్రదాయాచారాలు మనిషి జన్మించిన మరుక్షణం నుంచే అడుగడుక్కీ తమ ప్రభావాన్ని అతని జీవితంపై ప్రసరింపజేస్తూ మానవునిలోని సృజనాత్మక శక్తులను, స్వతంత్ర ఆలోచనా ప్రవృత్తిని అరికట్టి మానవ జీవితాన్ని నేటికీ సంక్షోభానికి గురి చేస్తూనే వున్నాయి. శిశువు జన్మించిన దగ్గరనుంచీ మరణించే వరకు సాంఘిక నియమాలు, మతాచారాలు, కుహనావిలువలు అతని జీవితాన్ని యధేచ్ఛగా నిర్దేశిస్తూ అతనికంటూ స్వంత జీవితంగాని, స్వంత అభిరుచిగాని లేకుండా అతన్ని శాసించి, పాలించి జీవితాన్ని దుర్భర వేదనాభూయిష్టం గావిస్తున్నాయి.

ఈ సామాజిక విషవలయాన్ని ఛేదించి తిరిగి కోల్పోయిన తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను నిలబెట్టుకొనుటకు జరిపే పోరాటంలో మానవునికి సహాయకారిగా అతని సాంఘిక జీవనంలో అనేక సిద్ధాంతాలు, తత్వశాస్త్రాలు రూపుదిద్దుకొన్నాయి. మానవ జీవితంలో సాంఘిక, ఆర్థిక, నైతిక రంగాలన్నింటిని నిర్వచించి ఆ యా పరిణామాలను విశ్లేషించి చూపుతూ జీవితాన్ని సూత్రీకరించటమే వీటి లక్ష్యం. చరిత్ర గతిలో అనేక మత, రాజకీయ, తాత్విక సిద్ధాంతాలు ఎన్నో వూపిరి పోసుకొని కొంత కాలం మానవునిపై సిద్ధాంతిక సూత్రాలను, ఆంక్షలను రుద్ది అతని జీవితాన్ని పాలించి చివరకు కాలగర్భంలో కలిసిపోగా తిరిగి మరల క్రొత్త సిద్ధాంతాలు మానవ సమాజంలో పుడుతూనే వున్నాయి.

మానవ జీవితం సిద్ధాంతాలకు, సూత్రాలకు మించినది, అనుక్షణం మారేది ఎటువంటి సూత్రాలైనా, నియమాలైనా మానవ జీవితాన్ని నిర్దేశించలేవు; వీటిని అధిగమించి జీవన ప్రవాహం ముందుకు సాగిపోతూనే వుంటుంది. సామాజిక పరిణామంలో తలెత్తిన అనేక

మత, రాజకీయ సిద్ధాంతాలు, సాంఘికాచారాలు కాల క్రమంలో తమ అస్తిత్వాన్ని కోల్పోయిన విషయాన్ని గమనిస్తే జీవితం వీటన్నింటికీ మించిన విలువైనదనే సత్యం వెల్లడి అవుతుంది. సిద్ధాంతాలకు, సూత్రాలకు నిబద్ధుడైన వ్యక్తి జీవితంలో వస్తున్న మార్పులకు అంధుడై క్రొత్త భావాలను అంగీకరించలేక తన భావ వికాసాన్ని నిలిపివేస్తాడు.

మానవ జీవితం ఎంతో విలువైనదీ, నిత్య నూతనమైనదీ కూడ సమగ్ర జీవిత స్వరూపాన్ని దర్శించ గోరే వ్యక్తులు తమ భావగమనంలో ఎదురయ్యే అనేక క్రొంగ్రొత్త భావాలకు, మార్పులకు ఆహ్వాన గీతం పలుకుతూ భావ వికాసోద్యమంలో ముమ్ముందుకు పయనిస్తూనే వుంటారు. ఆ పయనంలో నూతన సత్యాలను అన్వేషిస్తూ, స్వేచ్ఛాపోరాటం సలుపుతూ పరిపూర్ణ మానవులు కాగలుగుతారు

అట్టి మానవుని అవతరణయే యం. యన్. రాయ్ ప్రతిపాదించిన మానవ వాద లక్ష్యం. జీవితాన్ని సూత్రీకరించి, చుట్టూ వలయాన్ని ఏర్పరచి, మానవుని అందులో బందీ చేయక అతని స్వేచ్ఛా పిపాసకు, సృజనాత్మక శక్తులకు విలువనిచ్చి సమగ్ర మానవ వికాసానికి దోహదపడటమే మానవ వాద ముఖ్యోద్దేశ్యం మానవ సమాజానికి, మానవ జీవితాభ్యుదయానికి మానవుడే మూలం అనే సత్యాన్ని ఆవిష్కరిస్తూ మానవునిలో దాగిన సహజ సిద్ధమైన మానవతను వెలికి తీసి మానవాళిని మహోన్నత పథాన నడపటమే మానవవాద ధ్యేయం.

మానవ జీవిత వికాసానికి, ఆనందానికి, సిద్ధాంతాలు దోహదపడి జీవిత మార్గానికి వెలుగును చూపగలగాలి. అందుకు భిన్నంగా అంతర్గత శక్తులను, సహజ ప్రవృత్తిని అరికట్టి దాస్య ప్రవృత్తిని బోధించే ఏ సిద్ధాంతాలైనా కాలగర్భంలో కలసిపోక తప్పదు.

మానవ జీవితానికి సిద్ధాంతాలు చెప్పే భాష్యాలు, సూత్రాలు శాశ్వత సత్యాలు కానేరవు సిద్ధాంతాల పరిధిలో జీవితం ఇమడ జాలదు. జీవితం ఎంతో విస్తృతమైనది, నిరంతరం మార్పులకు గురి అయ్యేది. సత్యాన్వేషణలో జీవితం పట్ల తాత్విక చింతనతో జీవితపు లోతులను తరచి చూస్తూ మానవుడు ముమ్ముందుకు పురోగమిస్తూనే వుంటాడు. ఈ పురోగమనాన్ని ఏ మత రాజకీయ సిద్ధాంతాలు అడ్డుకోజాలవు.

మానవ జీవిత సమస్యలన్నింటిని వివేచనతో పరిశీలించి పరిష్కరించగలగటానికి మనిషి ముందు అంతర్ముఖుడై తనలోని మానవతను వెలికితీసి మానవీయ దృక్పథాన్ని అలవరుచుకోవాలి. మానవ వాదం ఇందుకు ఎంతో తోడ్పడుతుంది.

యం. యన్ రాయ్ ప్రతిపాదించిన మానవ వాదాన్ని మానవతా దృష్టిగల వ్యక్తులే అంగీకరించి ఆమోదించగలరు. మానవ వాదం మనిషి స్వభావంలో ఒక భాగం. మానవుని సహజ సంస్కార ప్రవృత్తినే రాయ్ మానవ వాదంగా ప్రతిపాదించారు. కాబట్టి దీన్ని ఒక సిద్ధాంతంగా పరిగణించవలసిన అవసరం లేదు. మానవ జీవితం మహోత్కృష్టమైనదిగా పరిగణించబడాలంటే మానవతయే ప్రాతిపదికగా వుండాలనేది రాయ్ చెప్పిన సిద్ధాంత సారాంశం.

ప్రపంచ వ్యాప్తంగా మానవునిలో రాయ్ ఆశించిన మానసిక పరిణామాలు కలిగిననాడు మానవుడు విశ్వ మానవాళి సంక్షేమానికై ఒక నూతన ప్రపంచాన్ని పునర్నిర్మించ గలుగుతాడు.

---

# చట్టం

అమాయకుల్ని వెన్నుపోటు పొడుస్తుంటుంది
ఖాకీని కంటికి రెప్పలా కాపాడుతుంటుంది !

— కె. కిశోరుబాబు

---

# LORD OF NEWS PAPER WORLD

కెనడాలో 1894 లో పుట్టిన 'రాయ్ హెర్బర్ట్ థాంప్సన్' పత్రికా ప్రపంచంలోని ఏకైక చక్రవర్తిగా గుర్తించ బడ్డాడు. కెనడాలో పుట్టి పెరిగినా బ్రిటన్ పౌరసత్వం తీసుకున్నాడు ఎలక్షన్‌లలో పాల్గొనటానికి. ఇంగ్లీష్ భాష మాట్లాడే కెనడా, బ్రిటన్, అమెరికా దేశాల్లోని పత్రికలలో అధికభాగం రాయ్ థాంప్సన్ నడిపేవే.

## మనకు తెలియని ప్రపంచం

రకట్టకృష్ణమూర్తి

అమెరికాలో వున్న దినపత్రికలు, ప్రపంచంలోని ఇతర దేశాల్లో 180 దిన పత్రికలు నడుపుతున్నాడీయన. ఇవికాక 172 వార, మాసపత్రికలు, ఏడు పుస్తకాలు ప్రచురించే సంస్థలు, 11 రేడియో స్టేషనులు, 19 టెలివిజన్ స్టేషనులు, 4 ట్రావెలింగ్ ఏజెన్సీలు, ఒక ఏర్‌లైన్స్ కంపెనీకి రాయ్‌థాంప్సన్ యజమాని.

ఇతని మొత్తం ఆస్తులు 1960 నాటికే 10 కోట్ల పౌండ్లు. అంటే అప్పటి మారకద్రవ్యం ప్రకారం 180 కోట్లరూపాయలు.

ఆర్థికంగా అట్టే అభివృద్ధి చెందని దేశాలలోని జర్నలిస్టులకి తర్ఫీదు ఇవ్వడానికి 40 లక్షల పౌండ్లతో ఓ స్కూలు స్థాపించాడు.

తన 40 వ సంవత్సరం వచ్చేదాకా రాయ్‌థాంప్సన్ ఆర్థికంగా చాలా నష్టపడుతూ వచ్చాడు. కార్ల వ్యాపారంలో చాలా నష్టపోయాడు. 1925 లో రేడియోలు వాడుకలోకి వచ్చాయి. రేడియోలు అమ్మేవ్యాపారం చేస్తూ అవి అధికంగా అమ్ముడవడానికి ఓ రేడియో స్టేషను నెలకొల్పాడు. తన రేడియో స్టేషను గురించి 'ప్రెస్' అనే వారపత్రిక వ్యంగ్యంగా రాయగా ఆ పత్రికని 6 వేల డాలర్లకి కొని వేసాడు.

9 లక్షల కాపీలు అమ్ముడయే 'సన్‌డే టైమ్స్' అనే పత్రికని కొని దాన్ని అభివృద్ధి చేశాడు. కోటిన్నర దాకా పెరిగింది సర్క్యులేషన్.

1967 లో అమెరికా నుంచి వెలువడే ప్రపంచంలో అత్యధిక ఆదరణ గల వార పత్రిక 'టైమ్స్'ని కొన్నాడు. అప్పటికే అది చాలా నష్టాలలో నడుస్తోంది. అయినా ధైర్యంచేసి కొన్నాడు. 1970 కల్లా నష్టం పోయి లాభం రాసాగింది.

'నేను మరణించే లోగా చక్కటి పత్రికలు ఎన్ని ఎక్కువగా వీలయితే అన్ని స్థాపించి చస్తాను' అంటాడు రాయ్ థాంప్సన్. ★

## చూద్దామన్నా చెడు దొరకదు ?!

మంచిని బోధించని వాళ్ళు
మంచి విలువ తెలియనివాళ్ళు
మచ్చుకైనా లేరు !
వచ్చిన చిక్కల్లా
బోధించడంతోనే సరిపెట్టుకోబట్టె
చెప్పేవారిలో ఒక్కరైనా
చెప్పిందాంట్లో ఒక్కటైనా
చేసి చూపించేవాళ్ళుంటే
"చూద్దామన్నా చెడు దొరకదు"
వ్రాద్దామన్నా కవులకేం వుండదు !!

— కమల్

# రుద్రజడ ---------------- యస్. యన్. దుర్గారావు

ఇది తులసిజాతికి చెందినది. రుద్రుని జడవలె దీనికి వెన్నులు బయలుదేరును గాన దీనికి ' రుద్రజడ ' అని పేరు వచ్చినది.

దీనికి సబ్జా గింజల మొక్క అని పేరు. రుద్రజడ అంటే తెలియకపోయినా సబ్జా గింజల మొక్కంటే ఛాలామంది పల్లెవాసులకు తెలుసు. ఈ పల్లెవాసులలో కొందరు దీనిని ' కుక్క తులసి ' అని చెప్పెదరు కాని అది పొరపాటు.




ఈ మొక్కలు మెట్టభూములలో వర్ష, శీతాకాలములలో కనపడుచుండును.

ఇది సుమారు గజమెత్తువరకు పెరుగును. ఆకు చిన్నగా వుండి కొద్దిపాటి కంగోరా కలిగి గుండ్రముగా నుండును. ఇంచుమించు తులసి ఆకులను పోలియుండును, కాని చిన్నవి. జడవంటి వెన్నులు వేయును. వీటిలో సూక్ష్మమైన పువ్వులుండును. తరువాత గింజలుగా మారును. వీటినే సబ్జాగింజ లందురు. ఈ వెన్నులలో ముద్దవెన్నుగలది, కోలవెన్నుగలది అని రెండు రకములు. మొక్క సమూలము తులసి వాసనను పోలిన సువాసన కలిగి యుండును.

ఇది చేదు, కారము రుచులు కలది. కటు విపాకము కలది. వేడిచేయు స్వభావము కలది. శ్వాసకాసలు, హృద్రోగములను అరికట్టును. గింజలు మాత్రము చలువ చేయు స్వభావము, మేహశాంతి కలిగించును.

దీని ఆకు పసరు శరీరమునకు పూయుచున్న గజ్జి చిడుము మొదలగు చర్మ రోగములు తగ్గును ; ఎండిన ఆకులను చూర్ణముచేసి దెబ్బలపై చల్లిన త్వరగా మానును ; ఆకు కషాయము సేవించిన ఉదరములో క్రిములు నశించును ; ఆకు మెత్తగా నూరి రసము తీసి చెవిలో రెండు మూడు చుక్కలు వేసిన చెవిపోటు శమించును ; తాజా ఆకులు కొన్ని నమిలి మ్రింగుచున్న హృద్రోగములు కొంతవరకు ఉపశమించును ; రాత్రి సబ్జాగింజలను నీటిలో నానవేసి ఉదయమున పంచదార కలిపి త్రాగిన రక్త విరేచనములు కట్టును ; చలువ చేయును ; దీనిని వేసవి కాలములో షర్బత్ పానీయముగా వాడవచ్చును ; వేరు కషాయము సేవించిన మూత్రము జారీయగును .

దీనితో పాషాణములు కట్టును, భస్మములగును. ★

## పాము

పామును చంపి భూమి మీద పడవేయరాదు. కంచ మీద పడవేయాలి. భూమి మీద పడినచో కుళ్ళి దానినుండి మంద విషం, మధ్య విషం, తీక్షణ విషం అనే మూడు జాతుల తేళ్ళు పుట్టును. మంద విషము ఎక్కదు మధ్య విషం బాధపెడుతుంది. కోరలతో పుట్టిన తేలు తీక్షణ విషము కరచిన మృత్యువు సంభవించును. పాము కరచిన 15 తులాలకు తక్కువ లేకుండా నెయ్యి త్రాగించినచో అపాయము తప్పును. తరువాత మంత్ర, తంత్రాలు చేయించుకోవచ్చును. విషమెంత వేగంగా రక్తంలో చేరుతుందో, అంత వేగంతో నెయ్యి చేరి, ఆ విషము యొక్క దోషమును తగ్గించును.

డా॥ తిరువూరు మధుసూదనరావు

'అంతగా అయితే ఆ బంగారం ఇచ్చిపో - మందిస్తాను. పైసలు తెచ్చి విడిపించుకో'.

చంద్రయ్యకు నెత్తిన ఆకాశం నుండి పిడుగులు పడ్డట్లనిపించింది.

ఈ నివీధిలో ఈ వానలో వెల్లువలో భార్య పుస్తెలను తాను చేజేతులా తెంపాలట. చంద్రయ్య స్థితప్రజ్ఞుడైనా చలించిపోయాడు.

అతనిలో కోపం కట్టలు తెంచుకొని ప్రవహించింది. మళ్ళీ సభ్యతా, దరిద్రమూ దాన్ని రెండు వైపుల నుండీ సామాన్యగమన వేగంలోకి మార్చగలిగాయి. అనంతమైన కోప ప్రవాహం అతని కింద పెదవిని రక్తమయం చేసింది.




హ్యూమానిటీ ఫర్ సేల్

రెండు కళ్ళ నుండి గంగా యమునలు ప్రవహించాయి. హృదయంలో సరస్వతి నిట్టూర్పుల వేడితో ఇంకి దృశ్యా దృశ్యమై అంతర్లీలగా మారిపోయి ఉండవచ్చు. సమ్మక్కకు ఇంత సంస్కారం లేకపోయింది. "భాడకోవ్ పుస్తెలడుగుతావురా కష్టంలో" ఆ తర్వాత అదే వేగంతో ఒకటి రెండు అనరాని మాటలను అన్నది - పిల్లవాణ్ణి బుజాన వేసుకొంది.

దవాఖానా నుండి వెనుదిరిగింది.

సమ్మక్క సెంటిమెంట్ చంద్రడికి తెలుసు.

భారతదేశంలో పుస్తెలకు కల విలువ వారిద్దరికీ తెలుసు. కాని శ్యాం తెలియనట్లు నటించాడు. "ముష్టి వెధవలకు కూడా బంగారం మీద మమకారం - బిడ్డ ప్రాణం కంటే బంగారమే ఎక్కువైంది వీళ్ళకు" అని వాళ్ళ నిష్క్రమణానికి భాష్యం చెప్పుకున్నాడు తనకు తాను.

ఫెళ్లమని తలుపులు రెండూ మూసుకున్నాడు. వానలో అలా తడుస్తూనే చిన్నోడు ఇల్లు చేరాడు.

వచ్చేటప్పుడు పమిటెచెంగు కప్పుకొని బిడ్డని తెచ్చింది సమ్మక్క.

పోయేప్పుడు ఆమె ఒక వర్షుకాభ్రంగా మారి ధారాపాతంగా జలపాతాలను ప్రవహింప చేస్తున్నప్పుడు ఆవేశంలో, ఆవేగంలో ఆమెకు బిడ్డడిపై పమిట కప్పానా లేదా అనే జ్ఞానం అంతరించడంలో ఆశ్చర్యం లేదు.

సమ్మణ్ణి ఇంటికి తీసుకెళ్ళి ఓ వెదురు చాపమీద పడేశారు.

ఒళ్ళు తెలియని దశలో కళ్ళు తేలవేసి జీవచ్ఛవంలా చిన్నోడు అలా పడివున్నాడు.

చంద్రయ్యా, సమ్మక్కా చెరో మూల ఏడుస్తూ కూర్చున్నారు. సమ్మక్క ఏడుపు మేఘమై వర్షించింది- ఉరుములై గర్జించింది.

చంద్రయ్య దుఃఖం మెరుపుల్లా ఉండి ఉండి తళతళ మంటున్నది. ఆ తర్వాత సమ్మక్క రూపంలో ఫెళ ఫెళమని తిట్లుగా పర్యవసిస్తున్నది.

చిన్నోడుకి యాదగిరి అని పేరు పెట్టుకున్నారా తల్లి దండ్రులు. లక్ష్మి నృసింహస్వామి వరం వల్ల పుట్టిన బిడ్డడు వాడు. గుట్టకు భువనగిరి నుండి నడిచిపోయి నడిచి వచ్చిన మహా భక్తులు వారు.

నృసింహస్వామి ముఖ్యంగా ఆరోగ్యానికి అధిపతి. ఎంతటి మహావ్యాధులైనా ఆయన నామ స్మరణతో నశించి పోతాయని భక్తుల విశ్వాసం.

చంద్రయ్య గుండెల నిండా నృసింహస్వామి నిండి వున్నాడు - ఆ మనోహరమైన మూర్తి

తన మనస్సు లాంటి గుట్టమీద కూర్చున్న ప్రభువు.

భార్య కన్నీళ్ళవంటి కొలనులో ఒక్కసారి మునిగి స్వామి దర్శనానికి భావలోకంలో నడిచాడు చంద్రయ్య - తన హృదయంవలె ఆయన ద్వారాలు రెండూ తెరుచుకొనే వున్నాయి.

స్వామి దివ్యమంగళ మూర్తి కన్పడింది.

ఆ మూర్తిని స్మరిస్తూ, చింతిస్తూ, ధ్యానిస్తూ తానే మూర్తిగా మారి చంద్రయ్య సొమ్మశిల్లాడు.

అది నిద్రా ? యోగనిద్రా !

చిన్నోడి పైన చింకి గుడిసె నుండి జలధారలు ప్రవహించాయి.

అశ్వనీ దేవతలవలె గుడిసెపైన మేఘాలు తెల్లవార్లూ ముసురుకున్నాయి.

ధన్వంతరి వెలుగువలె మెరుపులు చిన్నోడిని స్పృశించాయి. తెల్లవార్లూ సమ్మక్క ఏడుస్తూనే వుంది.

(జరిగిన కథ)

బంగాళాఖాతంలో వాయుగుండం మూలంగా నగరమంతా జలమయమయ్యింది. యాదయ్య చిన్నప్పటి మాట. ఒకసారి జబ్బు చేస్తే చంద్రయ్య, సమ్మక్క డా॥ రాజు దగ్గరికి వెళ్ళారు. అప్పటికింకా డా॥ మకరంద్ నగరానికి రాలేదు. చంద్రయ్య డాక్టర్‌కి తన స్వ ప రి చ య ం చేసుకున్నాడు. అయితే ఏ మా త్ర ం పట్టించుకోనట్టు వటించాడు. ప్రమాద పరిస్థితిలో నున్న యాదయ్యకి మందులు తేవటానికి చంద్రయ్య చేతిలో డబ్బులు లేకపొయ్యాయి. బతిమాలాడు. అయినా శ్యాం మనస్సు కరగలా. సమ్మక్క కాళ్ళమీద పడింది. అప్పుడు ఖంగుమన్న ఆమె మంగళసూత్రాలు చూసేసరికి శ్యాం మనస్సులో ఒక దుష్ట ఆలోచన మెదిలింది.

(ఇక చదవండి)

సమ్మి కన్నీళ్ళు అమృతం వలె కాలువలుకట్టి వెదురు బద్దల కిందినుండి ప్రవహించాయి.

చంద్రయ్య వ్యక్తావ్యక్త దశనుండి సుషుప్తి-ధ్యానమూ కాని విచిత్ర దశనుండి ప్రాణం అనే అనిర్వచనీయశక్తి చిన్నోడి జీవనాన్ని సంధుక్షణం చేసింది.

తెల్లవారింది ;

తూర్పున సూర్యుడు వికసించాడు.

వానకూ వెలుగుకూ శీతలవాయువులకూ చిన్నోడి రోగం నయమైంది. గత్యంతరంలేని దశలోని ప్రకృతి వైద్యంతో చిన్నోడు కళ్ళు తెరచి చూచాడు. తల్లి దుఃఖం వలెనే మూసీ కూడా ఇంకా నిరవధికంగా పారుతూనే వుండటం చూచాడు.

ఆకలి సూచిస్తూ అవ్యక్తంగా రోదించాడు.

# నిత్య సత్యాలు

* జీవితమంటే వెలుగు నీడల కలయిక. ఎండలో నుండి వస్తేనే నీడ సుఖము తెలిసేది. జీవితంలో సుఖ దుఃఖాలు రెండూ వుంటేనే 'ఎక్సైట్‌మెంట్'.

* మారదేశ వ్యాపారానికి ఓడలు ఎంత అవసరమో సత్యలోక ప్రాప్తికి ధర్మాచరణ అంత అవసరము.

* కష్టపడని ప్రాణికి సుఖప్రాప్తి లేదు. కష్టే ఫలి. కష్టాలు చవిచూచిన వానిని నిరాశ నిస్పృహలు ఏమీ చేయలేవు.

* పని చేయడం వలన ప్రయోజనం వుంటుంది వట్టి మాటలవల్ల ఏమీ ప్రయోజనం ఉండదు.

* పామునకు విషము కోఱలయందు ఉండును. తేలునకు తోకయందుండును. ఈగకు విషము తలయందుఉండును. దుర్జనునకు నిలువెల్ల విషమే.

* కోరికలు నెరవేర్చుకొనడం వలన గాక అసలు కోరికలే లేకుండా చేసుకోవడం వలన మనిషి సుఖపడుతాడు.

* చెడును గురించి కాకిలా గోలచేయకు. మంచిని గురించి కోయిలలా గానం చేయి.

* చెట్టు తన పండు తాను తినదు. నది తన నీరు తాను త్రాగదు. అట్లే సత్పురుషులు తమ జీవితంలో ప్రతి పని ఇతరుల కొఱకే చేస్తారు. ఇతరుల సుఖాన్నే ఆశిస్తారు

ఆ రోదన తిరిగి ప్రసర్జన్మలో వాడు చేసిన మరో ఆక్రందన.

ఆ దృశ్యం ఆ దంపతుల గుండెలనుండీ చెదిరిపోలేదు.

ఆ ఆక్రందన వారి చెవులలో ఇంకా ప్రతిధ్వనించడం మానలేదు.

నిలబెట్టిన విషపు పీపాలాగా సారాసీసాలాగా శ్యాం రూపం సమ్మక్క మనస్సునుండి తొలిగిపోనే లేదు.

అలాంటిది ఇవ్వాళ మళ్ళీ రాజు దగ్గరికి పోతానన్నది సమ్మక్క

చెల్లెలి కోసం రాజు దవాఖానాకే మళ్ళీ పోతానంటున్నది .... ....

చంద్రయ్య మనస్సులోని ఊహాచిత్రాలన్నీ స్తంభించి పోయాయి - గతంలో నుండి వర్తమానానికి వచ్చాడు. వాస్తవాన్ని దర్శించాడు

సమ్మక్క అప్పటికే తన ముందునుండి వెళ్ళిపోయింది. అంటే తనకు చెప్పడం కేవలం ఆనవాయితీ కోసమే కాని తన అనుమతి యిష్టా ఇష్టాలతో ప్రమేయం లేదన్నమాట. అప్పటికే చెల్లెల్ని తీసుకొని సమ్మక్క రాజు మేడవైపు సాగిపోయింది.

చంద్రయ్య చీకటిలోనే చీకటిని చూస్తూ అలాగే కూర్చున్నాడు చిన్నోడిని అక్కున చేర్చుకొని - సమ్మక్క సారిని వెంటబెట్టుకొని బురదనూ చెత్తనూ దాటి తారురోడ్డు పైకెక్కింది.

రాజు మేడముందు నిలబడింది.

నెట్టింది - తలుపులు దగ్గరే వేసుకొనివున్నాయి.

లోనికి వెళ్ళింది.

సమ్మక్క నీడలా సారక్క అనుసరించింది. ఇరువురూ మేడమెట్లెక్కారు.

కాలింగ్ బెల్ నొక్కింది సమ్మక్క.

తలుపులు తీశారు.

సమ్మక్క తలెత్తి చూచింది.

రాజు స్వయంగా తలుపులు తీశాడు.

నమస్కారం పెట్టారిద్దరూ.

మాట్లాడకుండా రాజు వాళ్ళని పైకి రమ్మని సంజ్ఞ చేసి ముందుకు నడిచాడు. సమ్మక్క చెల్లెలు కూడా లోపలికి వచ్చాక తలుపులు దగ్గరికి వేసి ముందుకు సాగింది భయం భయంగా-ఆమె ప్రతిధ్వనిలా సారక్క నడిచింది.

(సశేషం)

# పరతత్త్వ దర్శనం

## (ఛాందోగ్యోపనిషత్తు)

— సి. వేదవతి

సత్యకామ జాబాలి ఆశ్రమంలో ఉపకోశలుడు పన్నెండు సంవత్సరాల కాలం శిష్యరికం చేశాడు. గురుదేవులకు భక్తి శ్రద్ధలతో పరిచర్య చేశాడు. ఒక్క ఉపకోశలునికి తప్ప, మిగతా శిష్యులందరికీ ఉపదేశాలు పూర్తిచేసి వారివారి ఇళ్లకు పంపివేశారు గురువర్యులు. గురువుగారి భార్యకు జాలి కలిగింది–పాపం ఉపకోశలునికి కూడా ఉపదేశం చేసి మిగతా శిష్యులతోపాటు ఇంటికి పంపించివేయమని భర్తగారికి మనవి చేసింది. గురువుగారు ప్రత్యుత్తరం ఇవ్వలేదు సరికదా – ఆశ్రమాన్ని విడిచి అప్పటికప్పుడే ఎక్కడికో ప్రయాణమై వెళ్ళిపోయినారు!

ఉపకోశలుడు దిగులుపడుతూ కూర్చున్నాడు. అతడికి అన్నపానాదులు సహించలేదు. నానాటికి చిక్కి శల్యమవుతున్న శిష్యుడిని చూచి గురుపత్నికి జాలితో కూడిన వాత్సల్యం పెరిగింది. అన్నం తినమని ప్రతిమాలింది.

అందుకు ఉపకోశలుడు– "అమ్మా! నా హృదయం ఇంకా అపవిత్రంగానే ఉండి ఉంటుంది. అందుకే నాకు ఈ పరీక్ష! ఇట్లా ఉండి నేను అన్నం తినలేను!" – అన్నాడు ఆవేదనగా.

అప్పుడు ఒక చిత్రం జరిగింది. ఆశ్రమంలో జ్వలిస్తున్న అగ్నుల నుండి ఒక స్వరం ఇలా వినవచ్చింది.

"ఉపకోశలా! ప్రాణమే బ్రహ్మం. ఆకాశం బ్రహ్మం– ఆనందమున్నూ బ్రహ్మమే అని తెలుసుకో!"

"నాకు ప్రాణం బ్రహ్మమని మాత్రమే తెలుసు. ఆకాశమూ, ఆనందమూ కూడా బ్రహ్మతత్త్వమని తెలియదు" అన్నాడు ఉపకోశలుడు వినయంగా.

మళ్లీ అగ్నులనుండి అదే గంభీర స్వరం ఇలా వినవచ్చింది "హృదయ పద్మమందే బ్రహ్మతత్త్వం నివసిస్తున్నది. ఆ తత్త్వం యొక్క సహజ స్వరూపమే ఆనందం. పృథివి – సూర్య చంద్రాదులు – ఆ బ్రహ్మతత్త్వపు విభిన్న రూపాలే! సూర్యునిలో ఉన్న మూల పదార్థమే నేను. తూర్పు పడమరలలో, ఉత్తర దక్షిణాలలో, నక్షత్రాలలో, చంద్రునిలో – జలములో – ఉన్న తత్త్వమే నాలోను ఉన్నది. అంతటా వ్యాపించి ఉన్నది ఒక్కటే బ్రహ్మ తత్త్వం. ఈ మహత్తరమైన తత్త్వ జ్ఞానాన్ని తెలుసుకొన్నట్లయితే అన్ని భారాలు, బాధలు, చింతలు – నీ నుంచి దూరం అవుతాయి. నీకు ఎట్టి హాని కలగదు సుఖంగా జీవిస్తావు."

ఈ మాటలు చెప్పిన అగ్ని – మహోజ్వలరూపం ధరించినట్లైనది. ఆశ్రమంలో నిత్య విధులకు ఉపకరించే అగ్ని కొత్త రూపాన్ని పొంది బ్రహ్మతేజమై ద్యోతమానమైంది. భూమ్యాకాశాలు, సూర్యచంద్రులు, విద్యుల్లతలు, తారకలు – ఈ సర్వసృష్టి విశేషమూ ఉపకోశలునికి బ్రహ్మరూపమై సాక్షాత్కరించాయి

కొంతకాలానికి సత్యకాముడు ఆశ్రమానికి తిరిగి వచ్చి శిష్యుడిని చేరపిలిచాడు. బ్రహ్మ తేజస్సు ఉట్టిపడే ఉపకోశలుడి ముఖం చూడగానే గురువుగారికి అంతా అవగతమైంది.

"నాయనా! బ్రహ్మజ్ఞానమంతా గ్రహించినట్లు నీ ముఖబింబం తేజస్వంతమై వెలిగిపోతున్నది. ఆ తత్త్వాన్ని గురించి నీకు బోధ చేసినవారెవరు?" అని అడిగాడు సత్యకాముడు.

తనకు బ్రహ్మతత్త్వ సాక్షాత్కారం కలిగించినదెవరో ఉపకోశలుడు గురువుగారికి నివేదించాడు.

సత్యకామ జాబాలికి ఆనందం కలిగింది.

"నాయనా! నీవు తెలుసుకొన్నదే ఉత్కృష్టమైన సత్యం. నేను నీకు ఉపదేశించేది కూడా ఆ పరతత్త్వ సత్యమే! ఆ తత్త్వాన్ని ఎరిగినవాడు ధన్యుడు. తామరాకుపైన నీటి బొట్టు అంటనట్లుగా అతడిపైన ఏ దుష్ట ప్రభావమున్నూ సోకదు!

ఇపుడు నీ కన్నుల్లో కనిపిస్తున్న మెరుపు ఆ బ్రహ్మమే! అదే నీలోని ఆత్మస్వరూపం. అత్యంత సుందరమూ, ఉజ్జ్వలమూ అయిన ఆ ఆత్మ స్వరూపం – విశ్వమంతటా నిత్య సత్యంగా వెలుగొందుతుంది." అంటూ సత్యకాముడు శిష్యుడిని ఆశీర్వదించి ఇంటికి పంపించాడు.



# నన్నయ కావ్యార్థ సూచనము

మత్క్రియా వస్తు నిర్దేశో వాపి తన్ముఖమ్ " అని ఆచార్య దండి యనుశాసనము. ఈ సంప్రదాయమును ఎఱిగిన నన్నయ భట్టు భారతాదిలో క్రింది శ్లోకాన్ని రచించాడు.

శ్రీవాణీ గిరిజా శ్చిరాయ దధతో వక్షో ముఖాంగేషుయే
లోకానాం స్థితి మావ హన్త్య విహతాం స్త్రీ పుంస యోగోద్భవామ్
తే వేదత్రయ మూర్తయ స్త్రి పురుషా స్సంపూజితా వస్సురై
ర్భూయాసుగ పురోష త్త మాంబుజ భవశ్రీ కంధరా శ్రేయసే

ఈ ఆశీర్వాద గీర్వాణ వాణిలో

## చిల్లాపూరి శివరామకృష్ణశ

" మనాక్కావ్యార్థ సూచనమ్ " అను ప్రాచీనాలంకారికోక్తి ననుసరించి భారత తత్వము సూచింపబడెనని తోస్తుంది.

' శ్రీవాణీ గిరిజాః '

శ్రీ పదము సంపదకు సూచకము. దుర్యోధనునకు సంపదపై ఉండే అత్యాశ, దానికై అతడవలంబించిన దుర్మార్గములు, ధర్మమార్గంలో తనకు కాదగిన సంపద గురించి ధర్మరాజు కోరిక, దానిని పొందుట కాయన యవలంబించిన మార్గాలు భారత కథాగతికి మూలాలయ్యాయి.

వాణీ శబ్దము విద్యా వాచకం, మహా భారతాన్ని ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రమనీ, ఆధ్యాత్మ విదులు వేదాంతమనీ, నీతి విచక్షణులు సకల నీతి సారమనీ, పౌరాణికులు బహు పురాణ సముచ్చయమనీ చెప్పుదురని నన్నయభట్టే భారతాదిలో చెప్పాడు.

భారత శాంత్యనుశాసనికములు, సనత్సు జాతీయం భగవద్గీత, విదుర నీతులు మొ॥ ఘట్టాలలో పై వచనములు ప్రత్యక్షర సత్యాలని తేలుతాయి.

గిరిజాశబ్దం భగవతి కాళీమాతకు అంటే భగవానుని సంహారశక్తికి సూచకం. మహా భారతంలో భీష్మ ద్రోణ, శల్య పర్వాలు మొత్తం సంహారశక్తి చిద్విలాసానికి రంగస్థలాలగును. ఇతర పర్వాలలో గూడా సంహార సంబంధ మంతో ఇంతో కనబడుతూనే ఉంటుంది.

కౌరవుల యొక్క పాండవుల యొక్క సంపత్కాంక్ష కథలో అతి ప్రధానమవడంచే అది వక్షమునందున్నట్లు విద్య భారతమున ప్రముఖంగా ఉన్నది. సంహారశక్తి వ్యాపకంగా ఉన్నది. కావున ' వక్షోముఖాంగేషు ' అని కవి సూచించాడు.

ఈ సంపద, యీ విద్య, యీ సంహారం లోకస్థితిని నిలిపేవే. సంహార శక్తిచే కొందరు నశించినా స్త్రీ పుంస యోగోద్భవమయిన లోకస్థితి అవిహితంగా సాగుతూనే ఉంటుంది. శిక్షణ రక్షణ కోసమే యనేది సత్య సమ్మత మతమైన విషయం.

త్రి పురుషాః :

' పురిశేతే ఇతి పురుషః ' హృదయ పురంలో ఉండేవాడు కనుక పరమాత్మ పురుషుడు. ఇక్కడ త్రిమూర్తులను త్రిపురుషులుగా వ్యవహరించడం చేత ముమ్మూర్తులు పరబ్రహ్మ స్వరూపులే యని ధ్వనిస్తోంది.

సంపూజితాంః :-

భారత పరనంచే కంటే అందలి దర్మాదుల నాచరించడంచే పూర్ణకాములం కావచ్చునని యీపదం సూచిస్తుంది. పూజాపదంచే భక్తికి గల ప్రాధాన్యం గూడా ధ్వనిస్తుంది.

సురైః :-

తత్వ మొకటైనా అనేక మూర్త్యారాధన భారత మార్గానుసారుల కత్యావశ్యకం. నిత్య కర్మలలో ఒకటైన వైశ్వ

దేవం సకల దేవతారాధన విధానానికి చెందినదే. పరివార పూజలు, ఆవరణార్చనలు, అగ్నిష్టోమాది క్రతువులు బహుమూర్త్యారాధనను బలపఱచేవే. అనేకత్వం ద్వారా ఏకత్వానికి, అనేక మూర్త్యారాధన ద్వారా ఏకతత్త్వాన్ని చేరడానికి, భారతీయాధ్యాత్మిక పద్ధతులు దారిని చూపును. నన్నయ సురలను పదముచే అనేక మూర్త్యారాధనను సూచించి యుండును.

' పురుషోత్తమాంబుజ భవ శ్రీ కంధరాః :-

ఈ సమాస పదంలో పురుషోత్తమ పదం శ్రీకృష్ణుని, శ్రీకంధర పదం అర్జునుని సూచించి, భారత కథలో శ్రీకృష్ణార్జునులకు గల ప్రాధాన్యాన్ని తెలిపింది.

శ్రీ పదము ధనాన్ని ' కం ' శబ్దం పరమాత్మను తెలుపుతుంది. ధనాన్ని జయించి, పరమాత్మ అయిన వాసుదేవుని మనస్సులో పెట్టుకున్న ధనంజయుడు శ్రీ కంధరుడగును. లోకాన్ని పద్మాకారంలో ఉన్నట్లు వర్ణించడం పురాణ మర్యాద. అందున్న వారు అంబుజ భవులు. అనగా శ్రీకృష్ణార్జునుల కంటె ఇతరులగు భారతవీరులు ; ముఖ్యముగా ధర్మ పక్షీయులు. అంబుజ భవ పదముచే సూచింపబడిరనుకొనవచ్చును.

శ్రేయసే :

లౌకిక సుఖాన్ని ప్రేయస్సు, అది మోక్ష సుఖాన్ని 'శ్రేయస్సు' అని వ్యవహరిస్తారు. శ్రేయః ప్రేయస్సులలో భారత మార్గమునకు పరమోత్తమ ఫలము శ్రేయస్సే. ప్రేయస్సు అవాంతర ఫలమే గానీ జీవనమునకు పరమ ఫలము గాదు. ఇదియే వేద సిద్ధాంతము గూడ పంచమ వేదమైన భారతమునకు గూడ ఇదియే సారం.

మొదటి శ్లోకంలో సామాన్యంగా కథా సూచన చేస్తుంటారు. కాని భారత కథ జగత్ప్రసిద్ధమవడంచేత అందు కథార్థ సూచనం ఆవశ్యకం కాదు. కాని వేద తత్త్వంవలె భారత తత్త్వం గూడ గహన మవడంచేత దానిని మొదటి శ్లోకంలో సూచనా ప్రాయంగా తెలిపినాడు నన్నయ భట్టారకుడు. ★

# ప్రశ్నలు - సమాధానాలు

1. గోదావరి నదికి ఆనకట్ట ఎప్పుడు కట్టారు ?
2. తెలుగు అచ్చు అక్షరాలు ఏ సంవత్సరమున తయారైనవి ?
3 ఢిల్లీని ఏలిన మొదటి సుల్తాన్ ఎవరు ?
4. ప్రపంచంలోకెల్లా అతి జనసమ్మర్ధం కల దీవి ఏది ?
5. చెవులలో నీళ్ళు పోస్తే చనిపోయే జంతువేది?
6. భూమధ్యరేఖ వద్ద భూభ్రమణ వేగమెంత ?
7. ముద్రారాక్షసాన్ని రచించినదెవరు ?
8. ' బారిస్టర్ పార్వతీశం ' అనే పుస్తకాన్ని రచించినదెవరు?
9. ' సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ ' అనే సంస్థను స్థాపించినదెవరు ?
0. శంకరాచార్యులు స్థాపించిన నాలుగు మఠాలుఏవి?
11. మనదేశంలో పెల్లమందు అధికంగా ఎక్కడ తయారు చేయబడుతుంది ?
12 ఆఫ్రికా, యూరప్ ఖండాలను విడదీయు జల సంధి ఏది ?
13. పాట్నా నగరం ఏ ఏ నదులు కలిసేచోట ఉన్నది.

జవాబులు

1. 1852లో 2. 1806లో 3. కుతుబుద్దీన్ ఐబక్ 4 జావా 5. గుఱ్ఱము 6. గంటకు 1000 మైళ్ళు 7 విశాఖదత్తుడు 8. మొక్కపాటి నరసింహశాస్త్రి 9. గోపాలకృష్ణ గోఖలే 10. శారద, గోవర్ధన, శృంగేరీ, కంచి 11 ఉత్తర ప్రదేశ్‌లో 12. జిబ్రాల్టర్ జలసంధి 13. గంగా నది, శోణనది

# పుస్తకసమీక్ష

## సర్వమంగళా శతకము

రచయిత : శ్రీ వెలుదండ సత్యనారాయణ
ఆంధ్రశాఖాధ్యక్షుడు,
శ్రీ ఉమామహేశ్వర డిగ్రీ కాలేజి
కొండనాగుల 509 401   వెల : రు. 5/-

నిన్న మొన్నటిదాకా కవిత్వమంటే పద్య రూపంలో వ్రాయబడిన రచన అనే అభిప్రాయం వుంది. నిజం కూడా అంతే. నన్నయ్యగారికి ముందున్న పద సాహిత్యం భారతం స్థాయిని పొందలేకపోయింది. నేడు పుంఖాను పుంఖాలుగా వస్తున్న మినీ వచన కవితలు ఎంతకాలం నిలబడతాయో చెప్పలేం. ఈ కవులు సామాజిక స్పృహ అనే మాట పట్టుకొని, తాత్కాలిక ప్రయోజనాలను గూర్చి వ్రాస్తారు. ఆ ప్రయోజనం తీరితే ఆ కవిత్వం ప్రయోజనాన్ని కోల్పోతుంది. కవిత్వానికి శాశ్వత ప్రయోజనం వుండాలి. ఆత్మోన్నత్యం వుండాలి. దీనిని సాధించినకొద్దీ కవి మహాకవి అవుతాడు. అందరు కవులు కాలేరు. కొందరు మంచి పద్యాలు వ్రాయగలరు. దేనికైనా పూర్వ పుణ్యం, ఈ జన్మలో అభ్యాసం వుండాలి.

శ్రీ వెలుదండ సత్యనారాయణగారు సర్వమంగళా అన్న మకుటంతో నూటొక్క పద్యాలతో శతకం వ్రాశారు అన్నీ అమ్మవారిని గూర్చి వ్రాసిన పద్యాలే. "ఉపలాలితుండగు డింభకుండు మహాప్రసాదంబుగోరు చందంబున" వ్రాయబడినవే. సర్వకార్యాలు, సర్వమైన ఊహలు అమ్మవారి కృపా విశేషం వల్ల తనకు లభిస్తున్నాయని యీ రచయిత భావించడంవల్ల ఈ "సర్వ కవితా సంభారాన్ని" ఆవిడికే "నైవేద్యం" ఇచ్చాడు. అమ్మవారిని ఏదో కోరడం వేరు, తన కేది అవసరమో దానిని అమ్మవారే అనుగ్రహించాలని అనడం—దానికి ఆ అమ్మవారేమి ఇస్తుంది ? భక్తుడిని అనుగ్రహిస్తుంది తన సర్వస్వాన్ని శ్రీ మాత కర్పించడం ఈ శతకంలోని తాత్పర్యం. ఆ దేవి మహిమలను గానం చేయటం తాత్పర్యం.

అమ్మవారికి పూజార్థం ఈ శతకంలో ఉత్పల చంపకమాలలే ఉపయోగింపబడ్డాయి.

" జే మదశాలినీ ! లలిత ! చిన్మయి వాఙ్మయి !
ప్రేమరూప ! జే
జే మదనాశినీ ! అరుణ చేతన రూపిణీ !
సంశయఘ్న ! జే
జే మద పాటలా ! కమల శ్రీధరి మోహిని !
సర్వనామ ! జే
జే మహతీ ! సరస్వతి ! శుచీ ! సకలార్థద
సర్వమంగళా ! ( 100 వ పద్యం )

ఈ పద్యం చదివేటపుడు, లలితా సహస్రనామావళి అనే శ్రీదేవిని గూర్చిన గ్రంథంలోని "మదశాలిన్యై నమః, మదనాశిన్యై నమః, సంశయఘ్న్యై నమః, మద పాటల గండభువే నమః, చైతన్య కుసుమ ప్రియాయై నమః— స్తోత్ర విషయాలు జ్ఞప్తికి వస్తాయి. శ్రీ సత్యనారాయణగారు శ్రీ మాత వైభవాన్ని చదువుకొని ఆ సంస్కార బలంతో ఈ సర్వమంగళ శతకం రచించియున్నారని భావించవచ్చు.

ఇంకా అభ్యాసం చేస్తే వీరికి పద్య రచన చక్కగా సాగుతుంది. జగద్గురు శ్రీ శంకరుల సౌందర్య లహరిలోని "శివశ్శక్త్యా యుక్తో భవతి" వంటి శ్లోకాలకు వీరి అనువాదం పరిపక్వంగా లేకపోయినా, శైలీ విషయం మెచ్చదగినదే.

చివరగా ఒక్కమాట, శతకాన్ని ప్రకటించేముందు ఒకసారి పండితులకు విన్పించి వుంటే బాగుండేది. కొన్ని దోషాలున్నాయి. ఉదా : ( 99 పద్యంలో ) జవాబెయ్యేదొ తెల్యక అన్నారు. "తెలియ" అని వుండాలి. 55 పద్యంలో 'కప్పురంపు కలిక' అని వాడారు. పుంస్వాదేశంమీద నుగాగమం వచ్చి 'కప్పురంపుం గలిక' అని వ్రాయాలి కదా ! అలా వ్రాస్తే ప్రాసభంగం. కాబట్టి సవరించుకోవాలి "తవ పాద ధూళి, తవ సన్నిధి, తవ దేహము" వంటి ప్రయోగాలు శివ కవులకు చెల్లుతుందేమోగాని మనం చేయకూడదు. ఈ విషయం రచయిత గ్రహించగలరు.

— కాజ లక్ష్మినరసింహారావు

# కంప్యూటు శిక్షణ ఉద్యోగావకాశాలు

ఈమధ్య కాలంలో కంప్యూటర్ల గురించి చాలా ఎక్కువగా చదువుతూ, వింటూ ఉన్నాం. వేరే ఏ పరిశ్రమలోనూ ఎన్నడూ కనీవినీ ఎరుగని ప్రగతి మనకీ పరిశ్రమలో కనిపిస్తున్న దనడంలో సందేహం లేదు. కంప్యూటర్ రంగంలో వైజ్ఞానిక పురోభివృద్ధితో పాటు అనూహ్యంగ రోజురోజుకీ ధరలు పడిపోతూ ఉండడం వలన ఆఖరుకు అతి చిన్న వ్యాపార సంస్థలు కూడ కంప్యూటర్ల వాడకంలో ముందంజ వేసి అధిక లాభాలు పొందుతున్నాయి. మన దేశంలో ప్రస్తుతం సుమారు 250 కోట్ల రూపాయలు విలువచేసే ఈ పరిశ్రమ 1990 నాటికి 1000 కోట్ల రూపాయల పరిమాణానికి విస్తరించ గలదని అంచనా.

కంప్యూటర్లు రైల్వే, విమాన సంస్థల్లో రిజర్వేషన్ యంత్రాలుగాను, బ్యాంకులు ఇన్సూరెన్సు కంపెనీల్లో సామర్థ్యం పెంపొందించే సాధనాలుగా, విద్యుత్ సరఫరా సంస్థల్లో బిల్లులు, మరియు వ్యాపార సంస్థల్లో అనేక చిత్తాలు తయారుచేయడానికి గాను, ఉక్కు తదితర భారీ మధ్య తరహా పరిశ్రమలు, ఇంకా సిమెంటు, చక్కెర ఎరువులు తదితర రసాయన పరిశ్రమల్లో ఉత్పత్తి పెంచడానికి గాను, పోలీసులకు నేర పరిశోధనలోనూ, అలాగే డాక్టర్లు, లాయర్లు, ఇంజనీర్లు ఆర్కిటెక్టులు మొదలయిన వారికి వారివారి వృత్తుల్లో సహాయకారులు గాను, ఇకపోతే భూగర్భ, జల గర్భ వాతావరణ, పరిశోధనా కార్యకలాపాల్లోనూ, అలాగే టెలిఫోన్లు, ఆస్పత్రులు, హోటళ్ళు, లైబ్రరీలతో పాటు పరిపాలనా యంత్రాంగంలో కూడా........ఇలా ఒకటేమిటి దాదాపు అన్ని రంగాల్లోనూ కంప్యూటర్లు ప్రముఖ పాత్ర వహించి మానవ మనుగడను ఎంతో ఉలాన వంతం చేస్తున్నా యనడంలో అతిశయోక్తి లేదు.

అయితే యిన్ని రంగాల్లో యిన్ని పనులు చేయగల కంప్యూటర్ కేవలం ఒక యంత్రం మాత్రమే. దానికి కొంచెంకూడ తెలివితేటలు లేవనే విషయం మనం గుర్తుంచుకోవాలి. మనం యిచ్చే ఆదేశాలను-వీటినే ఇన్‌స్ట్రక్షన్స్ లేదా ప్రోగ్రామ్స్ అంటాము - ఈ ఆదేశాన్ని యథాతథంగా తు. చ. తప్పకుండ చిటికెలో చెయ్యగల సామర్థ్యం ఈ యంత్రానికుంది. పరిమాణం, శక్తిని బట్టి కంప్యూటర్లలో మైక్రో, మిని, మెయిన్ ఫ్రేమ్, సూపర్ కంప్యూటర్లని రకాలున్నాయి. సెకనుకు కొన్ని లక్షల నుండి కోట్ల వరకు ఆదేశాలు శిరసా వహించగల శక్తి వీటికుంది.

అయితే కంప్యూటర్ల చేత సమర్థవంతంగ పనిచేయించు కోవడ మనేది మనం ఆదేశాలిచ్చే నేర్పరితనం మీదనే ఆధారపడి ఉంటుంది. అంటే మనం తయారుచేసే ప్రోగ్రాముల మీద నన్నమాట. ఈ ప్రోగ్రాముల్నే సాఫ్ట్‌వేర్ అని, అలాగే కంప్యూటరు యంత్రములో భాగాల్ని హార్డ్‌వేర్ అని, అంటాము. శక్తి వంతమయిన హార్డ్‌వేర్‌కు తెలివయిన ప్రోగ్రామరు సమకూర్చే సాఫ్ట్‌వేర్ జత అయినప్పుడే ఉత్తమ ఫలితాలు లభిస్తాయి.

సాఫ్ట్‌వేర్ సమకూర్చడంలో, అంటే ప్రోగ్రాములు తయారు చేయడానికి, ఇంకాచెప్పాలంటే కంప్యూటరుకు ఆదేశాలివ్వడానికి అనేక భాషలున్నాయి. వీటినే కంప్యూటర్ భాషలు లేదా ప్రోగ్రామింగ్ భాషలంటారు.

వ్యాపార, వైజ్ఞానిక తదితర అవసరాల్ని బట్టి వీటిల్లో కోబాల్, ఫోర్ట్రాన్, బేసిక్, యిలా రకాలున్నాయి. ఒక్కొక్క భాషకు నిర్దిష్టమయిన వ్యాకరణ నియమాలున్నాయి. ఆయా నియమ నిబంధనల్ని, క్షుణ్ణంగ అవగాహన చేసుకుని, ఇచ్చిన అవసరాలకు నైపుణ్యంగ ప్రోగ్రాములు తయారు చెయ్యగలిగినప్పుడే ఆయా భాషల్లో ప్రావీణ్యం

## నీతి మంజరి

శ్లో॥ హరిణాపి హరేణాపి, బ్రహ్మణాపి
సురైరపి
లలాట లిఖితా రేఖా, పరిమార్ష్టుం
నశక్యతే

వ. అజునకైన పంకజాయతాక్షునికైన
హరునికైన నితర సురలకైన
ఫాల ఫలక లిఖిత భాగమ్ము దుడువగ
తరము కాదనంగ నరుల తరమె ?

శ్లో॥ అమంత్రణోత్సవా విప్రాః
గావో నవతృణోత్సవాః
భర్తాగమోత్సవా నార్యాః
సోహం కృష్ణ రణోత్సవః

వ. అగ్రజన్ములకు సదా మంత్రణము ప్రీతి
ధేనుసమితికి నవ తృణము ప్రీతి
భామినీమణులకు భర్త్రాగమము ప్రీతి
అనియె నాకు ప్రీతియైన కిరీటి

శ్లో॥ దుర్జనం కాంచనం భేరీ
దుష్ట స్త్రీ దుష్టవాహనమ్
ఇక్షుం తిలా నౌషధాన్ శ్చ
మర్దయే ద్గుణ వృద్ధయే.

వ. కాంచనమును, యిక్షుకాండమ్ము, భేరిని
తిలల, నౌషధముల, నలవిగాని
దుడుకు వాహనముల, దుష్టురాలిని, దుష్టు
నిల మధింతురు గుణమినుమడింప.

— పృథివి సుబ్బనాగయ్య కవి

వచ్చినట్లు లెక్క. అలా చెయ్యగలిగిన వారినే కంప్యూటరు ప్రోగ్రామర్లుగ గణించవచ్చు.

ఇక ప్రోగ్రామర్లు తయారుచేసిన ప్రోగ్రాముల్ని కంప్యూటరుకు అందించి ఆ మహా యంత్రంచేత పని చేయించే వ్యక్తుల్ని కంప్యూటర్ ఆపరేటర్లంటారు. మన డేటా నంతటినీ కంప్యూటర్లోకి వేగంగా ఫీడ్ చెయ్యగల వారిని డేటా ఎంట్రీ ఆపరేటర్లంటారు ప్రోగ్రామర్లుగ అనుభవం గణించిన వారు సిస్టమ్స్ అనలిస్టులు, ఆపైన సిస్టమ్స్ మేనేజర్లు అయ్యే అవకాశాలుంటాయి. ఇలా కంప్యూటర్ సారధులుగ డేటా ఎంట్రీ ఆపరేటర్లు, కంప్యూటర్ ఆపరేటర్లు, ప్రోగ్రామర్లు, సిస్టమ్స్ అనలిస్టులు, సిస్టమ్స్ మేనేజర్లు, మొదలయిన వారుంటారు. కంప్యూటర్ పరిమాణం, సంస్థ పరిమాణాన్ని బట్టి ఆయా విధుల్ని నిర్వహించడానికి వేరువేరు వ్యక్తులు ఉండడం, లేదా కొద్దిమంది లేదా ఒకే వ్యక్తి అన్ని విధుల్నీ నిర్వహించడం కూడ జరుగుతుంది.

కంప్యూటర్ రంగంలో అనూహ్యమైన పురోగతి వలన ఏడవ ప్రణాళికాంతానికి మనదేశంలో సుమారు 4 న్నర లక్షలమంది కంప్యూటర్ నిపుణులకు, అంటే యింతకు ముందు చెప్పిన ఆపరేటర్లు, ప్రోగ్రామర్లు, అనలిస్టులు మున్నగు వారికి ఉద్యోగావకాశాలు ఏర్పడనున్నాయి. అయితే ప్రస్తుతం వీరి సంఖ్య 30 వేలు మాత్రమే ఉంది. అంటే రాబోయే మూడు, నాలుగేళ్ళలో 4 లక్షలకు పైగ కంప్యూటర్ నిపుణులకు ఉద్యోగాలు లభించ నున్నాయన్నమాట.!

అయితే యింతమంది నిపుణుల్ని ఉత్పత్తి చెయ్యడం కూడ క్లిష్టమైన సమస్యే! దేశంలో ప్రస్తుతం ఉన్న విద్యాలయాలు, ఇన్స్టిట్యూట్లన్నీ కలిపి 1990 నాటికి కేవలం 80 వేలమందిని మాత్రమే సమకూర్చగలవన్నది ఇంకొక అంచనా.

కంప్యూటర్ శిక్షణాలయాల్లో ఇండియన్ ఇన్స్టిట్యూట్స్ ఆఫ్ టెక్నాలజీ, ఇంకాకొన్ని ఇంజనీరింగ్ కళాశాలల్లో ఎమ్. టెక్., బి. టెక్ స్థాయిల్లో కంప్యూ

టర్ సైన్సు బోధిస్తున్నారు. కొన్ని విశ్వ విద్యాలయాల్లో యమ్. సి. ఎ, డి. సి. ఎ. లని మాస్టర్సు, డిప్లొమా ప్రోగ్రాములు నిర్వహించుచున్నారు. కొన్ని కళాశాలల్లో యిప్పుడిప్పుడే గ్రాడ్యుయేషన్ స్థాయిలో కూడ కంప్యూటర్ సైన్సు ప్రవేశ పెడుతున్నారు.

కంప్యూటర్ శిక్షణకు రోజురోజుకు పెరుగుతున్న డిమాండును బట్టి వందల కొలది ప్రైవేటు సంస్థలు ఈ రంగంలోకి దిగాయి. డేటా ఎంట్రీ, కంప్యూటర్ ఆపరేషన్, ప్రోగ్రామింగులలో వీటిచ్చే శిక్షణ కొన్ని వారాలు మొదలు కొన్ని నెలల పర్యంతరం ఉంటుంది. కోర్సు కాల పరిమితిలో లాగానే వీరి శిక్షణా ప్రమాణాల్లో కూడ అనేక వ్యత్యాసాలుండడం సహజం.

ఇలాంటి సంస్థల్లో కోర్సులు చేపట్టే అభ్యర్థులు ఆయా సంస్థల, కోర్సుల బాగోగుల్ని సునిశితంగా పరిశీలించ వలసిన అవసరం ఎంతైనా ఉంది. వారు చేపట్టే కోర్సు ఎలాంటిది, ఉద్యోగావకాశాలు ఎంతవరకు ఉంటాయి, ఆ కోర్సును బోధించే అధ్యాపకులెవరు, వారికి కంప్యూటర్ రంగంలో అనుభవం ఉన్నదా, కోర్సు కేవలం క్లాసు రూముల్లో కూర్చుని నేర్చుకునేదేనా, లేక కంప్యూటర్ మీద ప్రాక్టికల్సు శిక్షణ ఉంటుందా, శిక్షణ కాలంలో అభ్యర్థుల్ని స్వహస్తాలతో కంప్యూటర్ మీద పని చేయనిస్తారా, ఎంత ఎక్కువగ అలా పని చేయనిస్తారు, పాఠ్య పుస్తకాల్లో అంశాల్ని బట్టీ పట్టించడమా లేక నిజ జీవితంలో తారసపడే సమస్యల్ని పరిష్కరించే పద్ధతులు నేర్పుతారా, ఇలాంటి విషయాలు తర్కించుకుని, సంతృప్తి చెందినప్పుడే ఆ కోర్సును చేపట్టాలి.

కంప్యూటర్ శిక్షణను పూర్తి వ్యాపార దృష్టితో చూస్తూ కొన్ని సంస్థలు స్వలాభానికై ప్రమాణాలు పూర్తిగా త్యాగంచేసి ఉద్యోగావకాశాల గురించి అభ్యర్థులకు అనేక అపోహలు గలిగిస్తున్నాయన్న విషయం సత్యదూరం కాదు. అయితే ఔత్సాహికులు పైన చెప్పిన అంశాల్ని అప్రమత్తతతో పరిశీలించి, కంప్యూటర్ శిక్షణను ఒక హాబీగా కాక, సీరియస్ వృత్తిగ గుర్తించి కృషి చేసినప్పుడే కంప్యూటర్ రంగంలో ఏర్పడుతున్న అపరమిత ఉద్యోగావకాశాల్ని చేజిక్కించుకోగలుగుతాము.

భిన్న ప్రమాణాలున్న సంస్థల్లో కోర్సులు చేసిన అభ్యర్థుల ప్రోగ్రామింగ్ ప్రావీణ్యాన్ని అంచనా వేసేందుకు జాతీయ స్థాయిలో పరీక్షలున్నాయి. కంప్యూటర్ సొసైటి ఆఫ్ ఇండియా వారు, అలాగే సి. ఎమ్. సి, లిమిటెడ్‌వారు సంవత్సరానికి రెండేసి పరీక్షలు నిర్వహిస్తున్నారు. ఈ పరీక్షల్లో ఉత్తీర్ణులయిన వారికి జాతీయ స్థాయిలో గుర్తింపు ఉంటుంది. సి. యస్. ఐ. పరీక్ష వ్రాయడానికి కనీస విద్యార్హత లేమీ అక్కర్లేదు. అయితే సి. యం. సి పరీక్ష వ్రాయడానికి మాత్రం ఏ సబ్జెక్టులోనయినా డిగ్రీ ఉండి, 50 శాతం మార్కులు కలిగి ఉండాలి.

ఇకపోతే కంప్యూటర్లు రంగ ప్రవేశం చెయ్యడంతో నిరుద్యోగం పెరిగి పోతుందని ఒక అపోహ ఉంది. కంప్యూటర్ల వలన అల్ప్యోత్పత్తి సామర్థ్యంగల ఒక తరగతి ఉద్యోగులు స్థాన భ్రంశమయ్యే మాట వాస్తవమే కాని అంతకు రెట్టింపు మందికి చురుకైన కంప్యూటర్ నిపుణుల రూపంలో ఉద్యోగావకాశాలు కలుగుతాయన్న సత్యాన్ని మనం విస్మరించకూడదు. మానవ మేధస్సుకు వెట్టిచాకిరీ సంకెళ్ళలోంచి విడిపించి అద్భుత యంత్రాల నుండి అత్యధిక సామర్థ్యాన్ని రాబట్టడానికి ఉపయోగించ వల్సిన అవసరం ఈ ఆధునిక సమాజంలో ఎంతేని ఉంది.

ఎన్. పి. కృష్ణ
ఛీఫ్ ఎగ్జిక్యూటివ్
యూనిక్ కంప్యూటర్ సర్వీసెస్
పటమట, విజయవాడ–6

( ఆకాశవాణి సౌజన్యంతో )

మినీ కథ

# రూపాయితో ఉద్యోగం

— కె. బి. కృష్ణ

**టెన్త్ పాసయి కాలేజీలో చేరాలా లేక ఏదైనా టెక్నికల్ కోర్సు చదవాలా అనే ఆలోచనలో వున్న రాజాకి తను ఊరికే కూర్చుండ ఏదో చేయాలనే తపన వుంది.**

**రోజూ పేపరు చూడటం, రాజాకి అలవాటు. అతన్ని ఆ రోజు ఒక ప్రకటన ఆకర్షించింది.**

" మా కంపెనీకి చాలామంది ఏజంట్లు కావాలి. టెన్త్ ప్యాసయినా సరే, ఫెయిలయినా సరే నెలకు జీతం రు. 425/- వివరాలకు క్రింది యడ్రసుకు రూపాయి మనియార్డరు చేయవలసింది. "

ఇదేమిటి ? ఆశ్చర్యంగా వుందే. యం. ఏ. చదివిన బాబాయ్ గాలికి తిరుగుతున్నాడు. బి. ఇడి. చదివిన అన్నయ్య ప్రైవేట్లు చెప్పుకుంటున్నాడు. యమ్. యస్‌సి. చదివిన తమ ఇంటి ప్రక్కన వాళ్ళబ్బాయి ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజీల చుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నాడు.

అయితే వాళ్ళందరూ ఈ ప్రకటన చూసివుండరు. పిచ్చివాళ్ళు.

పేపరు చదవటమేగాని, పేపర్లో మూల మూలనా ఏం ప్రకటనలున్నాయో చూసుకోవద్దూ. అయితే మనకి ఉద్యోగం దొరికి అందులో చేరిపోతే బావుంటుంది. ఎంత చదువు చదివితే మాత్రం ఏం ఉపయోగం ? రాజా ఆలోచనలు ఇలా కొనసాగాయి. వెంటనే ఆలస్యం చేయకుండా ఆ యడ్రసుకు రూపాయి మనీఆర్డరు చేశాడు.

ఆ ప్రకటన కత్తిరించి, దానితోపాటు మనీఆర్డరు కూపన్ కూడ జత చేసి జాగ్రత్తగా దాచుకున్నాడు.

" రాజా మరి ఇంటర్‌లో చేరతావా ? ఐ. టి. ఐ లో చేరతావా ? పాలిటెక్నిక్ పరీక్షలు వ్రాస్తావా " అంటూ తండ్రి వచ్చేడు.

" లేదు నాన్నగారూ మద్రాసులో ఉద్యోగం కోసం రూపాయి మనీ ఆర్డరు చేశాను అది వస్తే ఉద్యోగానికి వెళ్ళిపోతాను ఎందుకు ఎంత చదివినా ఉద్యోగం రాదు. అనవసరంగా డబ్బు ఖర్చు. శారీరక శ్రమ" అన్నాడు.

వీడికి మద్రాసులో ఉద్యోగమేమిటి ? అనుకుని " ఏమిటిరా నువ్వు వాగేది " అన్నాడు రాజా తండ్రి.

" ఇదిగో చూడండి " అని తను భద్రంగా దాచుకున్న పేపర్ కటింగ్ చూపించాడు విజయ గర్వంతో.

ఆయన అది చూడగానే నీరసంతో " ఇదా " అన్నారు.

"ఆదేమిటి నాన్నగారూ అలా అంటారు" అన్నాడు రాజా.

" బాబూ ఇది ఒక వ్యాపారం-వాళ్ళకి నీలాంటి ఏమీ తెలియని వాళ్ళు ఎన్నో రూపాయలు యమ్. వో చేస్తుంటారు ఈ వ్యాపారంచేసేది నిరుద్యోగులే. నీకు అప్లికేషన్ వివరాలు అసలు రావు నీ రూపాయితో ఇంతేసంగతులు "

" ఏం కాదు నాన్నగారు చూద్దాం కదా " అన్నాడు లోకం సంగతి తెలియని రాజా

" సరే నీమాట కాదని ఎందుకనాలి ? నువ్వే చెప్తావు తరువాత " అని ఆయన వెళ్ళిపోయారు.

రాజా, రోజూ పోస్టుకోసం ఎదురు చూస్తూనేవున్నాడు. ★

## ప్రేమలేని మనిషికన్నా

# ప్రాణమిచ్చే శునకమే మిన్న

తరాలు తరిలినా
యుగాలు దొరలినా
మనిషి బుద్ధీ మారలేదు
మమత సమత పెరుగలేదు...

మనసు లేదూ ... మమతలేదూ...
ప్రేమ లేదూ ... కరుణలేదూ...
చూడలేడూ ... ఓర్వలేడూ...
కోపమెక్కువ, తాపమెక్కువ...

మనసులేని మనిషి కన్నా
జాలిచూపుల గోవు మిన్న
మమత చూపని మనిషి కన్నా
పాలు యిచ్చే పశువు మిన్న...

ప్రేమ లేని మనిషి కన్నా
ప్రాణమిచ్చే శునకమే మిన్న
కరుణ చూపని మనిషి కన్నా
కరిగి కురిసే మబ్బు మిన్న ...

చూడలేని మనిషి కన్నా
స్వార్థమెరుగని నదము మిన్న
ఓర్వలేని మనిషి కన్నా
పంటనిచ్చే ధరణి మిన్న...

దానమివ్వని చేయి కన్నా
ఫలము నిచ్చే చెట్టు మిన్న
చదువు లేని మొద్దు కన్నా
మడిని దున్నే ఎద్దు మిన్న...

మానవ జీవితం అనేక కష్టాంపులతో, వేదనలతో, ఆవేదనలతో ; ఆశలతో, నిరాశలతో. బాధలతో, వ్యథలతో, కూడు కొని ఉంటుంది. కష్టాలను ఎదుర్కొనవలసివస్తుంటుంది. నిందలను, అపనిందలను మోయవలసివస్తుంది. కొన్ని సమయాలలో వాటిని గురించి బహిరంగంగా మాట్లాడలానికి కూడా అవకాశం లేకుండా పోతుంది. మన మనస్సులలో చెలరేగుతున్న బాధలను, వ్యథలను, వేదనలను, ఆవేదనలను పాలుపంచుకునే ఆత్మీయులు కూడా, కొన్ని కొన్ని సందర్భాలలో దగ్గర లేకుండా పోతారు. అప్పుడు ఏకాకిగానే పయనించవలసివస్తుంది. మాట్లాడగల మనిషికి కూడా హృదయం విప్పి చెప్పుకోడానికి అవకాశం లేకుండాపోతుంది. అప్పటివరకు తోడునీడగా వున్నవారు సహితం దూరమైపోతారు.

జీవితం అంటే తీపి వుంటుంది, చేదునూ చవిచూడవలసి వస్తుంది సంతోషం ఉంటుంది, దుఃఖం వుంటుంది. సంతోషంలో పాలు పంచుకొనే వారు, దుఃఖంలో కని పించరు సుఖంలో పంచుకొనే వారు, బాధలో దగ్గరికి రారు. తరతరాలనుండి, యుగయుగాలనుండి జరుగుతూ వస్తున్న వాస్తవం యిదే. నోరు ఉన్న మనిషి ఏదో విధంగా, ఎవరికో ఒకరికి తన బాధను వ్యక్తీకరించ గలుగుతాడు నోరులేని జంతువుకు మనస్సువున్నా తన భావాలను, బాధలను మరొకరికి చెప్పుకో లేదుగదా ! చెప్పుకోలేక పోయినంత మాత్రాన దానికి బాధలేదని చెప్పగలమా ? మనసులేదని వాదించగలమా ? దానికి ప్రేమ ఉండదని అనగలమా ? చెప్పుకోలేదు. కన్నీరు

## ఉత్తిష్ఠ! ఉత్తిష్ఠ!!

దేశమాతకి ఆరోగ్యం
బొత్తిగా బాగుండలేదు...
మందుతిన్న ఆహారం వల్లా కాదు
మండిపోతున్న ధరల వల్లా కాదు
కరువు కాటకాల వల్ల అసలే కాదు
మరైతే...?
కుక్కమూతి పిందెలకు పట్టిన గింజతెగుల్లా
పెరిగిపోయే అవినీతి, అన్యాయం
చూసి కాబోలు బెంబేలు పడిపోయి
ఆ పిచ్చి తల్లి బెంగెట్టుకుంది.
దగ్గితే 'హరీ' అంటుందంటున్నారు డాక్టర్లు!
ఈమె బ్రతికినా జీవచ్ఛవమే అన్నట్టు
పెదవి విరిచి చక్కా పోతున్నారు.
అయితే కన్నతల్లికి తలకొరివి
పెట్టేస్తామంటూ ఎందరో వడివడిగా
ముందుకొస్తూ కనిపించారు దుర్మార్గులు
తల్లీ! తస్మాత్ జాగ్రత్త! జాగ్రత్త!!

- మంతెన సూర్యనారాయణరాజు

మాత్రం కారుస్తుంది. ఆ మూగ బాధను అర్థం చేసుకోవడం చాలా కష్టం. అర్థం చేసుకొనే మానవులు కూడా బహు తక్కువే.

నా జీవితంలో ఆ విచిత్రమైన అనుభవాన్ని, అనుభూతిని నేను పొందాను, అనుభవించాను, ఆ వేదన చెందాను. వేదనలలో నలిగినప్పుడే, అవమానాగ్నిలో క్రాగినప్పుడే మానవ హృదయంలోని అసలైన లోతులు బయటపడుతాయి. అసలైన మానవత్వం విలువను తెలుసుకో గలుగుతాం. అప్పుడే తన పరిస్థితి ఏమిటో బోధపడుతుంది. కర్తవ్య మేమిటో అర్థమవుతుంది.

1971 సం. లో నేను ఒక కుక్కపిల్లను పెంచాను. దానికి ' టామి ' అని పేరు పెట్టాను. ప్రతిరోజు దానిని స్నానం నా స్వహస్తాలతో చేయించి, పౌడర్ చల్లేవాడిని. బిస్కట్లు, అన్నం, పాలు యిచ్చేవాడ్ని. ఎంతోగారాబంగా పెంచాను. అదికూడా ఎంతో చలాకీగా వుండేది. మంచిగా రాత్రిళ్ళు కాపలా కూడా కాస్తుండేది. 1975 జూలైలో అనగా అత్యయిక పరిస్థితి ( EMERGENCY ) విధించిన తొలిరోజునే, నేను ' మీసా ' క్రింద అరెస్టు కాబడి రాజమహేంద్రవరం, సెంట్రల్ జైలుకు వెళ్ళవలసి వచ్చింది. నా కుటుంబసభ్యులను, ఆత్మీయులను, స్నేహితులను వదలి ఏ విధంగా దూరమైపోయానో, అదే విధంగా నా 'టామి'కి కూడా దూరమయ్యాను 19 నెలల తరువాత విడుదలై నా స్వగ్రామం నందిగామకు చేరాను. ఎంతోమంది స్నేహితులు, బంధువులు, వందల సంఖ్యలో నన్ను పరామర్శించడానికి మా ఇంటికి వచ్చారు ఇల్లు కిటకిట లాడుతున్నది. అంతమంది మధ్యలో నున్న నా దగ్గరికి ' టామి ' కూడా పరిగెత్తుకుంటూ వచ్చింది. అది మాటలలో తన బాధను, వ్యధను వెలిబుచ్చలేదు గదా! అయితే ఒక అరగంట సేపు తన నాలుకతో నా వళ్ళంతా నాకింది. నన్ను వదలి పెట్టలేదు తన మూగ బాధను ఆ విధంగా వ్యక్తీకరించింది.

జీవితంలో ఎప్పుడు ఏమి జరుగుతుందో మనం చెప్పలేం గదా! పరిస్థితుల ప్రభావం వలన నేను నందిగామ వదలి మచిలీపట్నం నా కుటుంబంతో 1978 జూన్ నెలలో వచ్చేసాను. అయితే నన్ను ప్రేమించే టువంటి ' టామి ' ని మాత్రం నందిగామలోనే వదిలివేసాను. అప్పుడప్పుడు నందిగామ వెళ్ళి ' టామి ' ని పరామర్శిస్తుండేవాడను. అయితే దాని మూగ బాధను మాత్రం అర్థం చేసుకోలేక పోయాను. వయస్సు పెరగడం వలనసూ, సహజంగా దానికి జబ్బుచేసింది. వళ్ళంతా పుండ్లు పడ్డాయి. దానికి ఎన్నోమందులు నా తమ్ముడు యిప్పించాడు. కాని లాభం లేకపోయింది. 1985 సం. లో ఒక పర్యాయం నందిగామ వెళ్ళాను. " టామి కనిపించడం

లేదేం " అని నాతమ్ముడ్ని అడిగాను. " జబ్బుచేసింది, ఎన్నిమందులు యిప్పించినా నయంకాలేదు. అన్నం కూడా తినడం లేదు. పదిరోజుల నుంచి పశువుల దొడ్లోనే పడుకొని, పిలచినా రావడం లేదు. " అన్నాడు. నేను వెంటనే పశువుల దొడ్లోకి వెళ్ళి ' టామి ' అనిపిలిచాను. నామాటను విని ఏమాత్రం ఓపిక లేకపోయినా, తన సర్వ శక్తిని కూడకట్టుకుని లేచి తోక ఆడిస్తూ నా దగ్గరకు వచ్చింది ' రా ' అని పిలిచాను. నా వెంబడి నడిచి మా ఇంటికి వచ్చింది. అన్నంలో పాలుపోసి పిసికి, పిప్పిని తీసివేసి గిన్నెను దానిముందు పెట్టాను. ఆనందంతో పూర్తిగా త్రాగింది. అప్పటికి అన్నం ముట్టుకోక పది రోజులైంది. నన్ను తనివి తీరా నాకింది. మళ్ళీ పశువుల దొడ్లోకి వెళ్ళి పోయింది. నేను బజారుకు వెళ్ళాను రాత్రి ఎనిమిది గంటలకు తిరిగి ఇంటికి చేరాను. ' టామి ' ఇంట్లోలేదు. బ్యాటరీలైటు తీసుకొని పశువుల దొడ్లోకి వెళ్ళాను. ' టామి ' అని పిలిచాను. కదలలేదు. దగ్గరికి వెళ్ళి బ్యాటరీ లైటు వేశాను. ' టామి ' శాశ్వతంగా కన్నుమూసిందని గ్రహించాను. అంతే....నన్ను చూడాలని, నాచేతి ఆఖరి మెతుకును తినాలని షుమారు పది రోజులపాటు మృత్యువును సహితం వాయిదా వేసుకుంది పాపతో, వ్యధతో బందరు చేరుకున్నాను.

ఆ సంఘటనను తలచుకున్నప్పుడల్లా నా గుండె బరువెక్కేది. అప్రయత్నంగా కనుల వెంబడి కన్నీరు ప్రవహించేది. నోరు వున్న మానవునికి లేని ప్రేమ, ఆత్మీయత, నోరు లేని జంతువుకు భగవంతుడు ఎందుకు పెట్టాడా ? అని ఆలోచించేవాడను. బాధలలో, వ్యధలలో అప్రయత్నంగా మంచి కవిత్వం వస్తుందంటారు అనుభవజ్ఞులు. అదే నాకు జరిగింది. పై కవితను ఆనాడు వ్రాశాను. నాకోసం ఆనాడు 'టామి' ఎంత పరితపించిందో వియోగ బాధను ఎంత అనుభవించిందో జనరల్ వైద్య చనిపోయినప్పుడు కూడ ఆయన పెంపుడు కుక్క అదే విధమైన ఆవేదనతో ఆ మృత శరీరం చుట్టూ తిరుగుతూ కన్నీరు కార్చింది.

## వెంట ఏదీ తీసుకొని పోము

విశ్వవిఖ్యాత వీరుడుగా ప్రసిద్ధుడైన అలెగ్జాండర్ అపారమైన సంపద తన దేశానికి తరలించుకొని వెళ్ళాడు. భారతదేశం నుండి గ్రీసుకు వెళుతూ దారిలో ఆయన జబ్బుపడ్డాడు. అంతిమ ఘడియ సమీపించినట్లు గ్రహించాడా గ్రీకు వీరుడు. ఎంత సంపాదించినా ఏదీ తనవెంట రాదని, తాను జన్మించిన స్థలంలో మరణించే ప్రాప్తం కూడా తనకు లేదని తెలుసుకున్నాడు.

వాళ్ళ పద్ధతి ప్రకారం శవాన్ని ఒక పేటికలో ఉంచి ఊరేగించి ఖననం చేస్తారు. సేనానిని పిలిచి "నన్ను పెట్టెలో ఉంచాక చేతుల వద్ద బయటికి కనపడే విధంగా రెండు కన్నాలు ప్రత్యేకంగా పెట్టెకు ఏర్పాటుచేయించండి" అని ఆదేశించాడు. సేనాధిపతికి తన యజమాని ఇలా ఎందుకంటున్నాడో అర్థంకాలేదు. అప్పుడు అలెగ్జాండరే మళ్ళీ అన్నాడు. " ఎంత సంపాదించాడోకదా, వెంట తీసుకుని వెళ్ళుతున్నాడేమో అని కొందరికి అనుమానం వుండవచ్చు. చేతులు పెట్టె అవతల వ్రేలాడుతూ ఉంటే చేతుల్లో ఏమీ లేదని చూచిన వాళ్ళు తెలుసుకుంటారు."

ఈ విధంగా ఆ మహావీరుడికి చివరిదశలో ఆధ్యాత్మిక భావన అంకురించింది.

— కాకుటూరు సుబ్రహ్మణ్యం

నోరు ఉన్న మానవుడు, అన్నీ తెలుసునని విర్రవీగుతున్న మానవుడు మానవత్వాన్ని కోల్పోయి రాక్షసుడుగా మారి, అతి క్రూరంగా తోటి మానవులను హింసిస్తున్నాడు. నోరు లేని జంతువులు జాలిగా చూస్తూ కన్నీరు కారుస్తున్నాయి. ద్విపాద పశువులలో మానవత్వం మంటకలసి పోతున్నది చతుష్పాద జంతువులలో మాత్రం ప్రేమ, కరుణ పెంపొందుతున్నది. మానవునిలో ఎప్పటికి మానవత్వం పెంపొందుతుందో ! మానవుడు ఎప్పటికి మారుతాడో !

- కొమరగిరి కృష్ణమోహనరావు

# గోలే కాక మేలు కూడా చేసే కాకి

కాకులు చేసే గోలకు తపస్సు భంగమైనదనే కోపంతో కాకి జాతి అంతరించిపోవాలని శాపం ఇచ్చాడట ఒక ముని. ఆ మరుసటి పక్షానికి ఆశ్రమ ప్రాంతంలో ప్రబలిన దుర్గంధం భరించలేక శాపాన్ని ఉపసంహరించుకున్నాడట ఆ మునీశ్వరుడు ఇది పిట్టకథగా చెప్పబడినప్పటికి మానవుడికి కాకులు చేసే సేవంతా ఇందులో ఇమిడివుంది



**డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు**

మానవుడి ఉమ్మి మొదలుకొని, ఇంట్లో పనికిరాక పారవేసే ప్రతి వస్తువును ముక్కున కరచుకుని దూరంగా తీసుక వెళ్ళి పారేస్తాయి కాకులు. మానవుడి పంటను దోచే ఎలుకలు, పందికొక్కులను తింటాయి కాకులు. ఇంతేకాక కళేబరాలను త్వరితంగా తినేస్తూ మనకు సేవ చేస్తున్నాయి వర్షాకాలం ఆరంభలో పుట్టుక వచ్చే లక్షలాది రకాల కీటకాలను కంట్రోలు చేస్తున్నాయి కాకులు. ఆ కీటకాలను కాకులు ఆహారంగా గ్రహించక పోతే, వాటివల్ల సంక్రమించే వ్యాధులకు మానవ జాతి తట్టుక నిలబడ గలిగేదా అనేది ప్రశ్న.

పక్షులలో కెల్లా తెలివి గలది కాకి పరిసరాలను పరిశీలించడం, ప్రతిక్షణం అప్రమత్తంగా వుండడం, కాకికే చెల్లింది. తన శత్రువు ఎత్తుగడలను ముందే పసిగట్టి గల దిట్ట కాకి. వస్తువులను గుర్తించడం, విషయాన్ని అర్థం చేసుకోవడం, విశ్లేషణ చేయగల శక్తి కాకులకుందని ప్రయోగాలలో నిరూపించబడింది.

కాకులలో కాళ్ళు, రెక్కలు రెండు బాగా అభివృద్ధి చెందాయి అందువల్లనే కాకులు గాలిలో ఎంత వేగంగా ఎగురగలవో అంత సమర్థవంతంగా నేల మీద నడవ గలవు. కాకి ముక్కు ధృఢమైనది, దీనితో ఎంతో మందంగా వుండే పశువుల చర్మాన్ని పొడవగలదు.

సామూహిక జీవనానికి కాకులు బాగా అలవాటు పడ్డాయి. ఒకే చెట్టుపై తరతరాలుగా కాకులు ఎటువంటి తగాదాలు లేకుండా నివశిస్తాయి. నోటికి సరిపడా ఆహారం లభిస్తే ఎంతో గప్‌చిప్‌గా పట్టుక పోతుంది కాకి. అదే అధిక మోతాదులో కనిపిస్తే అడ్డమైన గోల చేసి కాకులన్నింటిని ఒక చోటకు చేరుస్తుంది. ఇక ఒక కాకి మరణిస్తే మిగిలిన కాకులు చేసే గొడవ చెప్పవలవి కాదు.

కాకుల్లో ఆడ, మొగ కాకులను గుర్తించడం కష్టం. ఇవి జీవితంలో ఒకేసారి జోడు కడతాయి గూడు కట్టేందుకు ఎండు పుల్లలే కాక, రబ్బరు ముక్కలు, యినుప తీగలను కూడా ఉపయోగిస్తాయి. మార్చి, ఏప్రియల్ మాసంలో గుడ్లు పెడతాయి. 2 నుంచి 10 గుడ్లవరకు పెడతాయి. కాని వీటిలో అధిక భాగం కోయిల పాలిట పడతాయి. కోయిల కాకి గుడ్లను గూటిలోంచి కిందికి తోసి వాటి స్థానంలో తన గుడ్లు వుంచుతుంది. అంత తెలివిగల కాకి కోయిల మోసాన్ని ఎందుకు గుర్తించలేక పోతుందో అర్థంకాదు.

గుడ్లు పొదుగుదల కాలం 2-3 వారాలు - అయిదారు వారాల్లో కాకి పిల్లలకు ఎగిరే శక్తి వస్తుంది. కాకులు న్యూజీలాండ్ దేశంలో తప్పించి ప్రపంచ వ్యాప్తంగా కనిపిస్తాయి.



# పెద్దనగారి కవితా స్వారస్యాలు

తెలుగు సాహిత్య యుగంలో ప్రబంధయుగం కవితా సరస్వతికి మల్లెపందిళ్ళు వేసిన కాలం. ప్రబంధాలకు ఆద్యుడు ఎవరైనా ప్రబంధ నిర్మాతలలో పెద్దనకు పెద్ద పీట వేయక తప్పదు.

రాయల యుగం స్వర్ణ యుగం. ఆ కాలంలోని కవులు భోగలాలసులు. ప్రధానంగా రాయలు విద్వత్కవి. కళలకు కాణాచియైన ఆ యుగంలో సంగీత సాహిత్యాలు ఉచ్ఛస్థితిలో విలసిల్లాయి. ఇక పెద్దనగారి పెద్దరికాన్ని చమత్కారాన్ని దిఙ్మాత్రంగా పరిశీలిద్దాము.

నన్నయగారి ప్రసన్న కథా కవితార్థయుక్తి, తిక్కన గారి నాటకీయత, ఎఱ్ఱనగారి శక్తివంతమైన తెలుగు వాతావరణము, నాచనసోముని క్రొత్త చమత్కారాలు, శ్రీనాధుని శయ్యా సౌభాగ్య ప్రీతి, పెద్దనగారి మను చరిత్రలో మనకు సాక్షాత్కరిస్తాయి.

మార్కండేయ పురాణంలో నాలుగైదు పుటలు మించని కథను తీసికొని ప్రతి పద్యాన్ని హృద్యంగా అల్లసాని పెద్దన మనుచరిత్రను ఆవిష్కరించాడు. దీనికి వరూధిని ప్రవరాఖ్యుల ప్రేమ కథ ప్రధాన వస్తువు. మను చరిత్రలో మూడు తరాల చరిత్ర వర్ణించబడింది. మొదటి మూడుఆశ్వాసాలు వరూధిని ప్రవరాఖ్యులకు సంబంధిచినం ఘట్టాలు. పాఠకుడు ఈ మూడు ఆశ్వాసాలను మించి ముందుకు పోలేడు. పెద్దన స్క్రీన్‌ప్లే రూపంలో కథను తయారుచేసి నాటకీయంగా పాత్రలను ప్రవేశపెట్టి చదువు చున్నంతసేపు ఒక సంగీత భరితమైన చలన చిత్రాన్ని చూస్తున్నంత ఆహ్లాదాన్ని పాఠకునికి కల్గించడమే దీనికి కారణము.

అరుణాస్పద పురములో పరమ నిష్టాగరిష్టుడు, నిత్యాగ్నిహోత్రుడైన ప్రవరుని ఇంటికి ఒక యోగి పుంగవుడు అతిథిగా ప్రవేశిస్తాడు. ప్రవరుడు ఆ యోగికి అతిధి మర్యాదలు కావించి భోజనానంతరము పాదసేవ చేయుచు స్వామీ ! మీరు ఏయే పుణ్యక్షేత్రాలను సందర్శించారు, ఏయే తీర్థాలలో స్నానమాడారు అని ప్రశ్నిస్తాడు. దానికి ఆయన నేను ఈ భూమండలము లోని వింతలన్నీ చూశానని సెలవిస్తాడు. తన వద్దగల పాదలేపనమనే ఔషధాన్ని చూపించి దాని సహాయముచే ఎచ్చటికైనను వెళ్ళవచ్చునని తెలియజేయుచూ ప్రవరుని కోరికపె ఆ పసరుని వాని కాలికి పూస్తాడు.

కొవ్వలి రామశేషు

హిమవత్పర్వత సందర్శనాభిలాషియైన ప్రవరుడు హిమ వన్నగముపై కాలిడి అక్కడి ప్రకృతి రామణీయకతను చూస్తూ పరవశించిపోతాడు. మధ్యాహ్న సమయమునకు సూర్యకిరణ స్పర్శకు ప్రవరుడి పాదలేపనము కరిగి పోతుంది. గృహోన్ముఖుడైన ప్రవరుడు దారి తెలిసికొను మార్గము కోసము అన్వేషించుచు గంధర్వాంగన యైన వరూధినిని చూస్తాడు. మోహాంధయైన ఆమె వలపు కోర్కెను తిరస్కరించి అగ్నిహోత్రుని ప్రార్థించి ఇంటికి చేరుకుంటాడు

## స్థూలంగా ఇది కథ

కథ ఎత్తుకోవడంలోను, చకచకా చెప్పటంలోను పెద్దనగారు నిజంగా తిక్కనగారిలాంటివారు. పెద్దనగారు మార్కండేయ పురాణంలో ఎవరు ఎవరికి చెప్పినది మూడు ముక్కలలో వివరించి అరుణాస్పదమనే పట్ట ణాన్ని చూపించారు. అనంతరం నాలుగు వర్ణాలవారిని, నాగవాసం వారిని ఒక్క సీసంలో చెప్పి కథానాయకుని వెనువెంటనే పరిచయం చేసూ కథా వేగాన్ని పెంచారు.

"ఆ పురి బాయకుండు మకరాంక శశాంక మనోజ్ఞ
మూర్తి భా
షాపతి శేషభోగి వివిధాధ్వర నిర్మల ధర్మ కర్మ దీ
క్షా పరతంత్రుడంబురుహ గర్భ కులాభరణం
బనారతా
ధ్యాపన తత్పరుండు ప్రవరాఖ్యుడలేఖ్య
తనూ విలాసుడై"

ప్రవరుడు మకరాంకుడికన్నా, శశాంకుడికన్నా మనోజ్ఞమైన వాడట. సాధారణంగా లోకంలో పురుషుడి అందాన్ని మన్మధునితోనో చంద్రునితోనో పోలుస్తారు. ఇక్కడ చంద్రుని కన్నా మన్మధుని కన్నా అందగాడని చెప్పడంలో అంతరార్థముంది. మకరాంకుడు శరీరము లేని వాడు, శశాంకుడు రాజయుగ్మవ్యాధి పీడితుడు. పైగా మకరాంక, శశాంకులిరువురు కామవాంఛాలోలురు వీరిలో నున్న లోపాలు ప్రవరుడిలో లేవు. పై మూడు పాదాల లోను ప్రవరుడి శారీరక సౌందర్యాన్ని అభివర్ణిస్తూ పద్యం చివరిలో "తనూ" శబ్దం ప్రయోగించడం పునరుక్తి దోషంగా గోచరిస్తుంది. సంస్కృతంలో "తనూ" శబ్దం ఊకారాంత స్త్రీలింగం. స్త్రీల వలె కోమలమైన శరీరము కలవాడు కనుకనే స్త్రీలు ఆతనిచే వలపింపబడుట కోసం ఆతృత చెందేవారు. ఇంత గొప్ప భావాన్ని "తనూ" శబ్దం ద్వారా కవి సాధించాడు.

సిద్ధుడు పసరు పూసిన వెంటనే ప్రవరుడు హిమవత్పర్వత ప్రాంతమున కేగ దలచాడు. ఒక చిన్న కందంలో ఆకాశమార్గమున సంచరించ దలచిన ప్రవరుని ప్రయాణమును అందంగా ఈ క్రింది పద్యంలో వర్ణించారు.

"ఆ మందిడి యాతడరిగిన
భూమిసురుడరిగె దుహిన భూధర శృంగ
శ్యామల కోమల కానన
హేమాఢ్య దరీ ఝరీ నిరీక్షాపేక్షన్"

ద్వితీయాశ్వాస ప్రారంభములో హిమశైల ప్రాంత నిసర్గ రామణీయతను పెద్దన ఇలా వర్ణించాడు.

**'శ్రీవాణి'కి రచనలు పంపేవారికి విజ్ఞప్తి**

* రచనలు కాగితానికి ఒక వైపునే రాయాలి.
* కథలు, వ్యాసాలు సంక్షిప్తంగా అచ్చులో రెండు పేజీలకు మించకుండా వుండాలి
* ప్రచురణకు తీసుకోబడని రచనలు త్రిప్పి పంపగోరువారు తగినన్ని స్టాంపులు అంటించిన సొంత చిరునామా కలిగిన కవరును జతపరచాలి. లేనిచో రచనలు త్రిప్పి పంపబడవు. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరములకు అవకాశము లేదు — సంపాదకుడు

"అటజనికాంచె భూమిసురుడంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ
నిస్స్వన స్ఫుట నటనానురూప పరిఫుల్ల కలాప
కలాపి జాలమున్
కటక చరత్కరేణు కర కంపిత సాలము శీత
శైలమున్"

ఈ పద్యము పాండిత్యప్రకర్షకోసము చాలామంది పండితులు తరగతిలో చదివి ప్రశంసింప బడుతుంటారు. కేవలం శబ్దాడంబరమే తప్ప అంతకుమించి అర్థాన్ని వెతకటం వ్యర్థమని వారి అభిప్రాయము. శ్రవణ సుభగత్వం కూడిన ఈ పద్యం చివరి పాదంలో "కరేణు" అన్న పద ప్రయోగం ద్వారా కవి సూచ్యార్థ సూచన చేశాడు ఆడ ఏనుగుల విజృంభణను కవి వర్ణించడం రాబోయే కథలో వరూధిని ఆధిక్యతను తెలియజేయడం కోసమే. హిమవంతముపై కాలిడిన ప్రవరుని పాద లేపనము కరిగిపోయింది. దారి తెలియని ప్రవరుడికి ఒక పాట వినిపించింది ఆ దిక్కున పోతూ ఉన్నాడు. అప్పుడు

"మృగ మద సౌరభ విభవ
ద్విగుణిత ఘనసార సాంద్రవీటీ గంధ
స్థగితేతర పరిమళమై
మగువ పొలుపు తెలుపు నొక్క మారుత మొలసెన్"

డుదాని ఉనికిని తెలియజేసే గాలి వీచిందట. ఆ గాలిలో ఉన్న వాసన వీటీ గంధము. పెద్దనగారు ఆ కాలంలో స్త్రీలు ఉపయోగించే తాంబూలములోని ప్రత్యేకతను తెలియజేశారు

క్రియా పదంతో ప్రారంభించడం పెద్దనగారి సొత్తు. "చూచి ఝళం ఝళత్కటక నూచవేగ పదారవిందయై" అన్న పద్యం ఇందుకు ఉదాహరణ. ద్వితీయాశ్వాసములో వరూధిని ప్రవరాఖ్యుల నర్మగర్భోక్తులతో కూడిన సంభాషణలో శృంగారం పరాకాష్ఠకు చేరుకుంది. "ఎవ్వతె వీవు భీతి హరిణేక్షణ" "ఇంతలు కన్నులుండ" మున్నగు పద్యాలను పెద్దనగారు మాత్రమే వ్రాయగలరు. కనుకనే రాయల యుగంలో ప్రబంధ సుందరి రసికావతంసులైన కవులను అలరింపజేసింది. ఇలా అల్లసానివారి కవితా స్వారస్యాలను ప్రతి పద్యంలోను దర్శించడానికి అవకాశముంది.

మొదటి మూడు అశ్వాసాలలోను పెద్దనగారు చూపించిన శిల్ప చాతుర్యం, రస పోషణ తరువాతి కథలో కుంటుపడింది కవి తన కాలంలోని సాంఘిక పరిస్థితుల నుంచి తప్పించుకోలేకపోవడమే దీనికి కారణం. ★

---

బాలవాణి

## మా తాత గుండు

మా తాత గుండు
మహా నున్నగుండు ॥
మా తాత పిలక
ఆడేటి గిలక !
మా తాత కళ్ళు
నేరేడు పళ్ళు !
మా తాత ముక్కు
కోపాన నిక్కు !
మా తాత నవ్వు
మందార పువ్వు !
మా తాత పలుకు
గారాబ మొలుకు !
మా తాత బొజ్జ
పాపాయి సెజ్జ !
మా తాత కోటు
రాదారి బోటు !
మా తాత నోరు
విప్పితే బోరు !

— సోమంచి రామం

## బడి పిల్లలం ...

పిల్లలం... బడి పిల్లలం...
చరిత్ర మార్చే పిడుగులం ...
అమ్మ చెబితే ఆలకిస్తాం ...
నాన్న చెబితే నడుచుకుంటాం ...
గురువు చెబితే చదువుకుంటాం ...
కన్నవారికి వన్నె తెస్తాం ...
దైవ భక్తిని కలిగి వుంటాం ...
దేశ భక్తిని రుజువు చేస్తాం ...
దేశమాతను గౌరవిస్తాం ...
దేశ ప్రగతిని పెంచివేస్తాం ...
చదువుకుంటాం... నేర్చుకుంటాం ...
ఫస్టు మార్కులు తెచ్చుకుంటాం ...
పైకి వస్తాం ... పేరు తెస్తాం ...
దేశ గతినే మార్చివేస్తాం ...
బుజ్జగిస్తే మాట వింటాం ...
దెబ్బ కొడితే మొండికేస్తాం ...
ఆదరిస్తే అందుకుంటాం ...
కసురుకుంటే దూరమవుతాం ...

- కొమరగిరి

# రంజనిమాల

సంకలనం

డా॥ వి. ఫణీంద్రుడు

నండూరి " ఎంకి పాటలు " తెలుగు (సంగీత, సాహిత్య ప్రియులకి) వారందరికి తెలిసినవే. ఆ పాటలంటే ఉండే అభిమానంతో సమకూర్చిన ఈ రంజనిమాలలో పదాలు ఎంకి పాటల నుండి తీయబడినవి. అవి ఆ పాటల పేర్లు కావచ్చును, పాటల వాక్యాల నుండి కావచ్చును. ఆ పదాలు :— ఎంకి, కొంటె, కొకోకో, నారాజు, నీతోటి, ఎంకిరాణి, రేవెలుగు, సరాగాలు, మాటకోటలు, ముత్యాలపేరు, ముసిముసులు, సాటేలా నీకు, ముద్దుల నా యెంకి, సాగరుని సల్లాపమా.

ఈ దిగువ నీయబడిన ఆధారములతో నింపి రంజనిమాలను పూరించండి.



## ఆధారములు

అడ్డం :

3. పాట పేరు, పాట మొదలు నీకు సరికావట
5. పాట మొదలు " అద్దములో నా రాజు " అయితే (పేరు) హారం కావచ్చును
6. "నీటి చిత్రాలు" ఈ "పటముల మీలగొని రాసినేడు"
7. "పూవు నేనైతే" అని సక్కని రాగాలు పలికింది
8. ఆమె "నా పేరతనికేమిలేనట"
11. అద్దములో లేక అడ్డములో కనబడతావుట
12. " ఆట పాటలలోనే " పలుకు (రాజ) భవనాలు కాబోలు

నిలువు :

1. ఎంకి జలకపు ప్రేమ గుసగుసలా! చిరునవ్వులా!
2. "గుండె గొంతుకలోన కొట్లాడుతాది"
3. ఎంకి తపస్సు ! సముద్రుని ఆలాపన ! ఏమో !
4. సత్తెకాలపు నా ఎంకి ఇలా " ఉంటాను నాయుడు బావా " అంది
8. "నామాట తెలువవే" అని కాశీరాణి అంటే 'ఆమె' "పూల బూరను" అంది
9. " ఎవరైన ఎపుడైన " ఎంకిని ఆ కాంతిలో చూసారా
10. "కొండతిరిగి కోనతిరిగి" కోయిల పాడిన పాట ★

## ఫిబ్రవరి రంజనిమాల సమాధానములు

నిలువు : 1. అనంత భూపాలుడు 2. విరూపాక్షరాయలు 3. రాచూరి తిమ్మరాజు 4. లీలాశుకుడు 5 తిమ్మ జగపతి రాజు 6 వెల్ల 10. అంతర్వేది 11. నీలంసంజీవరెడ్డి 12. జయతాపురం, 1‌3. తెనాలి రామకృష్ణుడు 15. చంగీజుఖాన్ 16 నాగావళి 18. కేశవరావు 19 భారవి

అడ్డము : 1 అడవి బాపిరాజు 2 లీలావతి 7. పాపులూరి మల్లన్న 8. కుసినగర 9. రాజా ఇమ్మడి అంకినీడు 12. జయంతి 14 రాయరఘునాధుడు 17 కట్టమంచి రామలింగారెడ్డి 18 కేతరాజు 19 భాస్కరకృష్ణ 20. శ్రీపాదరాయలు 21. కొండుభట్టు.

## నిజమైన బలం గుణబలమే ( 16వ పేజీ తరువాయి)

### పరిస్థితి, ప్రయత్నం

మానవత్వములో ప్రయత్నము అత్యవసరం. ప్రయత్నము గట్టిగా చేసినప్పుడు లక్ష్యాన్ని మనం చేరగలం. పరిస్థితి + ప్రయత్నము = జీవుడు ఈనాడు పరిస్థితిని మనము విచారించటములేదు. ప్రయత్నమా ? హృదయపూర్వకంగా చేయటంలేదు. మొట్టమొదట అధ్యాపకులు ఈ విషయాన్ని గుర్తించాలి. విద్యార్థి ఏ స్థాయిలో ఉంటున్నాడు ? గురువు ఏ స్థాయితో ఉంటున్నాడు ? నా స్థాయినుండి, విద్యార్థి స్థాయికి దిగటమా ? లేక విద్యార్థిని నా స్థాయికి తెచ్చుకోవటమా ? అనే విషయంలో గురువులు విచారణ చేయాలి. విద్యార్థిని నీ స్థాయికి తెప్పించుకొనే పరిస్థితి వచ్చేంతవరకు నీవు విద్యార్థి స్థాయికి దిగాలి. "నేను పిహెచ్. డి. చేశాను, ప్రొఫెసర్ని, నా స్థాయి పెద్దది" అని ఆ స్థాయిలో పాఠం చెప్పుకుంటూ పోతే పిల్లలు ఏ విధంగా అర్థం చేసుకోగలరు ? కనుక గురువులు తమ స్థాయి నుండి పిల్లల స్థాయికి దిగినప్పుడే వారు అర్థం చేసుకోవడానికి వీలవుతుంది కనుక ఈ రెండింటి పరిస్థితిని మొట్టమొదట గురువులు గుర్తించాలి ఈనాడు ఈ స్థితి అధ్యాపకులలో లేదు, "నా Duty నేను చేశాను పాఠం చెప్పాను. పరీక్షలలో వాడు బాగా వ్రాసే పాస్ అవుతాడు లేకపోతే ఫెయిల్ అవుతాడు." అని అధ్యాపకులు భావిస్తున్నారు, ఈ స్థితి మారాలి నీ డ్యూటి ఏమిటంటే ఎన్ని శ్రమలకైనా ఓర్చి నీ విద్యార్థిని నీవు పాస్ అయ్యేటట్లుగా నీవు ప్రయత్నించాలి. ఇది నీ యొక్క Profession. నీ స్వార్థమే నీవు చూచుకొని, పాఠం నీ స్థాయిలో చెప్పి, వారు ఏమైన అయిపోనీ, నా డ్యూటీ నేను చేశానని భావించడం ఏ మాత్రం ధర్మంకాదు. అధ్యాపకులు ఒక విషయం గుర్తించాలి ఏమీ తెలియనటువంటివారే మీ దగ్గరకు చేరుతారుగాని, తెలిసినటువంటివాడైతే, వాడూ ఒక గురువవుతాడు. కనుక తెలియని వారికి, తెలియజెప్పి తెలిసేటట్లుగా చేయడమే గురువుయొక్క కర్తవ్యం.

### అధ్యాపకుల కర్తవ్యం

విద్యార్థులను ఆశాజీవులుగా చేయాలి. నిరాశాపరులుగా తీర్చి దిద్దకూడదు. నిరాశతో, నిస్పృహతో, విరక్తిని పొందే విద్యార్థులకు ఆశ, ఆనందం, ధైర్యం అందించే చక్కటి టానిక్ వంటివారుగా ఉండాలి అధ్యాపకులు. అధ్యాపకులు నిరంతరం విద్యార్థులకు ఉత్సాహప్రోత్సాహముల నందించాలి విద్యార్థులకు మనం ఏనాడూ నిరుత్సాహంగా కనిపించకూడదు. నీవు పాస్ అవుతావా ? ఖాయంగా ఫెయిల్ అవుతావ్ ! అని ఏనాడూ నిరుత్సాహపరచరాదు వాడు ఫెయిల్ అయ్యే విద్యార్థి అయినాసరే, ధైర్యం చెప్పి ఉత్సాహపరచాలి. అధ్యాపకులు చేయవలసిన ప్రధాన కర్తవ్యం ఇదే.

### ప్రత్యేకత

మన సత్యసాయి విశ్వవిద్యాలయంలో ప్రత్యేకమైనది ఏమిటి ? విచారిస్తే "మానవత్వంలో వున్న గుణాన్ని పోషించడం, మానవత్వాన్ని వికసింపజేయటం". కేవలం డిగ్రీలకోసం ప్రాకులాడటం కాదు. ఇక్కడ మానవత్వాన్ని వికసింపజేసుకునే డిగ్రీనే ప్రధానంగా భావించాలి దీనిని Human value అంటారు. మానవత్వం యొక్క విలువను మనం నిలబెట్టుకోవాలి. ఇంతకంటే మించిన డిగ్రీ వేరొకటిలేదు. "శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రః' నీవు అమృత పుత్రుడవు అనేదానిని నిలబెట్టుకోవాలి. అనృత పుత్రుడవు కాకూడదు. అమృతము సర్వులకు ఆనందాన్ని అందిస్తుంది. అమృత పుత్రుడు సమాజమునకు ఆనందము నందించేవాడుగా రూపొందాలి. ఇలాంటి పుత్రులను తయారుచేయటం అధ్యాపకుల బాధ్యత. కనుక అధ్యాపకులు, విద్యార్థులు ఈ విధమైన పవిత్ర భావములను హృదయమునందు చేర్చుకొని, అభివృద్ధి పరచుకొని, ఆచరణలో పెట్టి, ఆనందాన్ని అనుభవిస్తారని ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని ముగిస్తున్నాను.

# ఔర్వుని కథ

విన్నకోట సుశీలాదేవి

మహాభారతంలో ఒక విచిత్రమైన      ఉన్నది.

పూర్వము కృతవీర్యుడను రాజు కలడు. అతడు పెక్కు క్రతువులను చేసెను. భృగువంశ్యులైన వేదవిదులు అతని యజ్ఞములందు యాజ్ఞికులుగా వ్యవహరించిరి. రాజు ఆభృగువంశ్యులను ధన దానములచేత తృప్తి చెందించెను.

కృతవీర్యుడు మరణించెను. అతని వంశమువారు భృగువంశమువారి యెడ ద్వేషము వహించి యుండిరి. ఆ బ్రాహ్మణులు ధనలుబ్ధులై తమ తండ్రి ధనమంతయు నపహరించిరని వారిని నిందించిరి. భార్గవులు భయపడిరి. రాజు ఇచ్చిన దానరూప ధనమును కొందరు భృగువంశీయులు రాజకుమారులకిచ్చిరి. మరికొందరు బ్రాహ్మణులకు దానమిచ్చిరి. కొందరు ఎవ్వరికివి ఇవ్వక ఇండ్లలో పాతిపెట్టి ప్రమాదము లేదని భావించి సుఖముండిరి.

ఆ క్షత్రియులు ఒక భార్గవుని యిల్లు త్రవ్వి చూడగా ఆ ధనము కనబడినది. భార్గవులందరూ రాజధనవంచకులైరని విరోధము వహించి గర్భస్థ శిశువులతో సహా భార్గవులందరిని ఆ దుర్మార్గులు వధించిరి, భార్గవుల భార్యలు భయపడి హిమవంతమునకు పారిపోయిరి.

వారిలో ఒక భృగుపత్ని భయపడి తన యూరుదేశమున గర్భము ధరించినది దాని నెఱిగి క్షత్రియులు దానిని భేదింప సమకట్ట వచ్చిరి. కాని అంతకు ముందలగానే ఆమె యూరుదేశమున నుండి భార్గవుడొకడు జన్మించెను అతనే ఔర్వుడని పిలువబడువాడు. అతడు ప్రళయకాల సూర్యునివలె మిక్కిలి తేజస్సుతో ప్రకాశించుచుండెను

అతనిని చూడగానే కృతవీర్య వంశీయులైన క్షత్రియులకు చూపు పోయినది. గ్రుడ్డివారై దీనతతో అరణ్యము అందు తిరుగుచుండిరి.

ఆ క్షత్రియులు ఔర్వుని తల్లి యొద్దకు వచ్చి దృష్టి దానము చేయవలయునని వేడుకొనిరి. ఆమె వారితో నిట్లనెను. "నేను మీ చూపులు తీసికోలేదు. ఈ కుమారుడు సూర్యతేజుడు. తన తండ్రులకు మీ రపకారము చేసినందులకు కోపించి మీ పాపబుద్ధికి తగినట్లు చేసినాడు. వాడు నా గర్భమునందుండగానే వేదవేదాంగములు నేర్చినవాడు. వానినే ప్రార్థింపుడు"

ఆమె మాట ప్రకారము క్షత్రియాధములు ఔర్వుని ప్రార్థించి తమ దృష్టులు పొందిరి.

కాని ఔర్వుడు తన పితృబంధు జనులందరు ఒక్కసారిగా చనిపోవుటకు మిక్కిలి దుఃఖించెను. సకల లోక ప్రళయార్థముగా ఘోరతపము ప్రారంభించెను

అతని తప తీవ్రతకు మూడు లోకములు తల్లడిల్లినవి పితృలోకవాసులైన అతని పితరులు ఔర్వుని తపః ప్రభావము గుర్తించి వానియొద్దకు వచ్చి యిట్లనిరి.

అయ్యా! నీ తపోమహాత్మ్యమునకు లోకములు భయపడుచున్నవి. లోకములందనుగ్రహము చూపుము. కోపము విడువుము. కృతవీర్య వంశీయులైన క్షత్రియులు మమ్ము చంపిరనియేగదా నీవు కినుక వహించినది. మేము క్షత్రియుల చేత వధింపబడునంత అసమర్థులము గాము. ధనలుబ్ధులము గాము. మేము ధనమునే కోరినచో కుబేరుడు మాకు తెచ్చియిచ్చును. తపోమహాత్మ్యము చేత మాకు ఆయుపు చాలా పెద్దయైనది. దానికి మేము సంతోషింప

లేదు. మాకు ఈ మానవలోకమందు హేయబుద్ధి కలిగినది. మనుష్యలోకమున నుండదలపలేదు. ఆత్మహత్య చేసికొందమా యన్న ఆత్మహత్యచేత పుణ్యలోకములు పోవును. అందుచేత క్షత్రియులతో విరోధము తెచ్చుకొని ఆ నిమిత్తముగా మా దేహములు విడిచితిమి. భార్గవుల తేజమును పరిభవించువారు లోకమున లేరు. కావున క్షత్రియులు మమ్ము చంపిరను కోపముతో సర్వజనులకు ఉపద్రవము తెచ్చి పెట్టకుము. అదియే మా కోరిక.

ఈ కథ విచిత్రమైనదని మొదలు చెప్పితిని ఆ వైచిత్ర్యమిది. భార్గవులు తపస్సంపన్నులు. వారు శరీర త్యాగము చేయ గోరిరి. యోగ మార్గమున దేహ త్యాగము చేయవచ్చును.

యోగిధారణా ద్రక్రమమున సమాహితాత్ముడై వాయువులను సన్నిరుద్ధము చేసిన అవి ఊర్ధ్వగతిని గైకొనును అప్పుడా యోగి అవయవములనుండి ప్రాణములను పాపికొనుచు వచ్చును. అంతట సర్వ ద్వారములు మూయబడుటచే ఆత్మమూర్ధంబు భేదించి మహోల్కాకారమున ఆకసమున కెగిరి, కొంత దవ్వు అరిగి అంతర్హితమగును. అట్లు పోవు ఆత్మ మానవుల దృష్టులకు కనబడదు.

భగవద్గీతలో గూడ ' పరమాం గతిమ్ ' పొందుటకు యోగమే సులభోపాయమని శ్రీ కృష్ణ భగవానుడు చెప్పినాడు.

సర్వద్వారాణి సంయమ్య మనోహృది నిరుధ్యచ
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణమ్
ఓమిత్యేకాక్షరం బ్రహ్మవ్యాహరన్ మామనుస్మరన్
యఃప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాంగతిమ్.

భగవద్గీతలో ఇంకను ఇట్లు చెప్పబడినది.

" యోగి తపస్వుల కంటెను జ్ఞానులకంటెను, కర్మనిష్ఠుల కంటెను అధికుడు "

ఇట్లు శరీరమును చాలించుటకు అక్లేశ మార్గముండగా భార్గవులు క్షత్రియులచేత చంపబడుట అను జుగుప్సాకరమును ఎందులకు అవలంబించిరో బుద్ధి గోచరమగుటలేదు. యోగమార్గమున దేహ త్యాగము చేయుట ఆ నాటి తపస్వులకు తెలిసియుండలేదా ? ఆ మార్గముగూడ ఆత్మహత్యా సదృశమని వారు భావించిరా ? సుప్రసిద్ధులగు వేదవిదులును పౌరాణికులును వివరింపదగిన విషయము ఇది. 

## నా అన్వేషణ మనిషి కోసం!

నేను మనిషి కోసం అన్వేషిస్తున్నాను
కాంతిలోనే చీకటిని వెతుక్కుంటూ
కలసి రాని కాలమంటూ
ఖర్మ అని గోళ్ళు గిల్లుకునే
మనిషి కోసం కాదు నా అన్వేషణ
చీకటిలో కాంతిని చూడగలిగి
కాలాన్నెదిరించి పురోగమించే
మనిషి కోసం నా అన్వేషణ !

అచేతనత్వం నింపుకొని
అస్పష్ట ఛాందస చక్రాల క్రిందపడి నలిగే
మనిషి కోసం కాదు నా అన్వేషణ
చైతన్యాన్ని ఆత్మీకరించుకొని
తనంటే అస్పష్ట ఛాందస చక్రాలు
ఆమడ దూరం పోయేటట్లు చేసే
మనిషి కోసం నా అన్వేషణ ! !

తల వంచుకు నడిచే
మనిషి కోసం కాదు నా అన్వేషణ
ఈ వ్యవస్థ గుండెల్లోకి—
ఎక్స్‌ప్రెస్‌లా దూసుకుపోయేట్లు చూసే
మనిషి కోసం నా అన్వేషణ ! ! !

— ఐ. ఎల్. ఎన్. చంద్రశేఖర్

# జ్యోతిషవాణి

నిర్వహణ : దైవజ్ఞరత్న వాస్తు జ్యోతిష విద్వాన్

**కవితా కామేశ్వర శర్మ**

అవనిగడ్డ - 521 121

కూరాడ కృష్ణనాగేశ్వరవిరల్ బందరు

సమా : మీకు 24-1-1987 తో గురుదశ పూర్తి. శని దశ వస్తుంది గనుక 87 లో బ్యాంకు ఉద్యోగం వస్తుంది. శని జపం చేయించండి. 86 చివరలో కూడా అవకాశం లేకపోలేదు.

నామని సదానందం గూడూరు

సమా : పోయిన ఇంగ్లీషను మొత్తంమీద పూర్తిచేస్తారు. పై చదువు పూర్తిగా కొనసాగునని తోచదు. అయినా ప్రయత్నించండి.

పి. నారాయణరావు జక్కపల్లి

సమా : కోరుకున్న అమ్మాయితో 87 లో పెండ్లి జరగ వచ్చును. ఉద్యోగం 88. 87 లో అవకాశం లేకపోలేదను కోండి చివరిలో. భవిష్యత్ ఫరవాలేదు. ఆశయములు సిద్ధించును [ బౌవిశాత్ కాదు భవిష్యత్ ]

## జ్యోతిషవాణి

పేరు ... ....... .... ......... .... .. .... .... .. ........

పూర్తి చిరునామా ......... .... .. .............. .... ....

... .... .... .... .... .... .... ......... ....

లేఖ వ్రాయు తేది . .... .... .. ....

టైము పగలు/రాత్రి .. .. .. ........

జనన తేది............లేనిచో సుమారు వయస్సు

కొండపల్లి రాఘవేంద్రరావు విజయవాడ-10

సమా : మీ జాతకం ముమ్ముందు బాగుంటుంది. ప్రస్తుతం సామాన్యం అనూరాధ నక్షత్రంలో ప్రశ్న. ఆగితే ఇంకా 2 సంవత్సరములు ఆగండి వ్యాపార ప్రారంభమునకు.

సిహెచ్. శివరామకృష్ణరావు బందరు

సమా : మీకు 1987 లో ఉద్యోగ ప్రాప్తి సూచనలు గలవు ఉత్తరాభాద్ర నక్షత్రమునకు 1987 అనుకూలం. సుందరకాండ చదవండి రోజూ 36 వ సర్గ మీ జాతకంలో దశలో లోపం ఏదో వుండి వుండవచ్చు జనన తేది-కాలం వున్నవి గదా. జాతకం ప్రధానం గదా. జాతకం [ చక్రం ] వేయించుకోండి. బాగా తెలుస్తుంది.

శైలజ "... ... ..."

సమా : సంపాదనకు మంచిరోజులు. కాని మానసికంగా మంచి కాలం కాదు. చదువుకున్నా సంస్కారంలేని అత్తగారివల్ల సుఖం ఏలా వుంటుంది. ఇంకా ఏడాది వరకూ ఇంతే. మీరెంత సంపాదించినా [వందలు కాదు] ఎవరకు మెప్పు. నిబ్బరం పరమౌషధం. అంతకింటే ఏం చెప్పను. ఆరోగ్యానికి ఆదిత్య హృదయం చదవండి. పేరు మార్చనక్కరలేదు. అసలు జాతకం వేయించుకోండి

భగవాన్ శ్రీ వాత్సవ ఉమానాథ్ బందరు

సమా : ఉద్యోగం 1987 లో వస్తుంది. ఓపిక పట్టండి. అందరి అదృష్టాలు ఒకే రకంగా వుండవు గదా ! హనుమంతునికి పూజలు చేయించండి.

ఎ. శారద విస్సన్నపేట

సమా : మీరు జాతకం పంపినారు. అందులోని అంకెలు దేనిని సూచించునో నాకు తెలియరావడంలేదు అయినా నాకు అర్థమయినదేమంటే ప్రస్తుతం బుధ మహాదశ 1993 వరకు. 1987 లో వివాహం కాదు ఉద్యోగం రాదు. బ్యాంకు ఉద్యోగానికి అవకాశాలున్నవి మొత్తం మీద పరాయి సంబంధము. సంపాదన బాగుంటుంది. ధనలాభాధిపతుల కలయిక మంచి లక్షణము చం + గురువు = మంచి యోగం. అధియోగ లక్షణం - "సౌమ్యై రుపచయ గైర్భహు ధనః" - గు. చాలు ఉపచయం.



# శ్రీ సత్యసాయి ఇన్స్టిట్యూట్ ఆఫ్ హయ్యర్ లెర్నింగ్

విద్యాగిరి, ప్రశాంతినిలయం - 515 134 (ఆంధ్రప్రదేశ్)

# ప్రవేశ ప్రకటన

1987 జూన్ మాసము నుండి ప్రారంభము కానున్న ఆర్ట్స్, సైన్స్, కామర్స్, అండర్ గ్రాడ్యుయేట్ పోస్ట్ గ్రాడ్యుయేట్ కోర్సులలోను, యం. బి. ఎ., బి. యిడి. కోర్సులలోను ప్రవేశములకై విద్యార్థుల నుండి దరఖాస్తులు కోరబడుచున్నవి. దరఖాస్తు ఫారములు 15-2-1987 నుండి 25-3-1987 వరకు రిజిస్ట్రారు కార్యాలయము నుండి పొందవచ్చును. బి. ఎ. / బి. యస్‌సి. / బి. కాం. కోర్సులలో ప్రవేశము కోరువారు కనీసం 50 శాతం మార్కులతో 12 సంవత్సరముల విద్యాభ్యాసమును 1987 మే మాసంలోగా పూర్తిచేసి యుండవలెను. ఎం. బి. ఎ, బి. యిడి. తో సహా ఇతర పోస్ట్ గ్రాడ్యుయేట్ కోర్సులలో ప్రవేశము కోరువారు తమ పాఠ్య విషయము మరియు సాధారణ ఇంగ్లీషులో కనీసం 50 శాతం మార్కులతో 10+2+3 లేదా దానికి సరి సమానమైన ఇతర విద్యా పద్ధతి ననుసరించి 1987 మే మాసంలోగా 15 సంవత్సరముల విద్యాభ్యాసము పూర్తిచేసి యుండవలెను. దరఖాస్తు ఫారము, సమాచార దర్శిని (Information hand book) తెప్పించుకొనుటకు ఎం. బి ఎ., బి. యిడి. కోర్సులలో ప్రవేశం కోరువారు 35/- రూ.లు, తదితరులు 25/- రూ.లు శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హయ్యర్ లెర్నింగ్ పేర ఐ. పి. ఓ. లేదా బ్యాంకు డ్రాఫ్టు ద్వారా పంపవలెను. కోర్సుల వివరాలు ప్రవేశ పరీక్షలు మరియు ఇంటర్వ్యూ తేదీలు సమాచారదర్శిని (Information hand book) లో చూచుకొనవచ్చును




రిజిస్ట్రారు

Postal Registered
No. H/MPM/34, Dt. 10-12-84

SREE VANI

Regd. with Registrar of News Pape
No. RN 000121/20/AL/85 NT

శుభాకాంక్షలతో

# లక్ష్మీ జనరల్ స్టోర్స్

బీసెంటు రోడ్.....గవర్నరుపేట
విజయవాడ-2

ఫ్యాషన్ వస్త్రముల సప్లయిదారులు



